# స్వవిషయము

వందలాది సంవత్సరములనుండి బానిసగ బంధించిన దాస్య శృంఖలాలను యెట్టకేలకు విడదీసికొని విముక్తి బొందిన నేటిస్వతంత్ర భారతికి తొలి కానుక మాయీ పది యాఱవ కృతికుసుమము.

నవ్యకవితా సుందరికి నీరాజనము పట్టిన శ్రీ దేవులపల్లి రామానుజ రావు గారు ఆధునికాంధ్ర ప్రౌఢ కవులుగనూ, నవ్యాతి నవ్యాభ్యుదయ సాహితి యెడల గూడా సానుభూతి గల విమర్శకులుగనూ మరియు తెలంగాణమునందు ఏకైక సారస్వత మాసపత్రికగా శోభిల్లుచున్న "శోభ"కు సంపాదకులుగను తెనుగు సాహిత్యోపాసకులకు సుపరిచితులు. వీరు న్యాయవాదులే అయినా మాతృభాషా సేవకు తమ సర్వశక్తులను ధారబోయ సంకల్పించి ఆ వృత్తి నియవలంబింపక సారస్వత వ్యవసాయమునకు గడంగిరి. వీరి అసంఖ్యాకములగు అమూల్య రచనలలోని కొన్నింటికి మాత్రము మొట్టమొదటిసారి పుస్తకరూప మొసగు భాగ్యము మాకు లభించినందులకు సంతోషము.

ఈ పుస్తకములోని వ్యాసములు అప్పుడప్పుడు 'తెలంగాణా' 'గోలకొండ' మొదలగు పత్రికలలోని సారస్వతానుబంధములలో ప్రకటితములైనవి. విషయ ప్రాధాన్యతవల్లనేమి రచనా ప్రాశస్త్యమువల్లనేమి ఈ వ్యాసములను సంగ్రహించి సంగ్రథించుటకు శ్రీ రావుగారును, ఉదాహృతములైన పత్రికాధిపతులును అనుమతి యొసంగినందులకు కృతజ్ఞతలు. కాని, వ్యాసరూపములో దేనికది పూర్ణముగా సందర్భశుద్ధిగా, చక్కగా చెక్కబడిన వ్యాసముల నొకమాలలోనికి గ్రుచ్చుటకు వలయు మార్పులను చేయు బాధ్యత మాత్రము సమితిపైననే వదలిరి.

కాబట్టి ఈ గ్రంథములోని గుణములన్నియు శ్రీ రావుగారివేయనియు, గుణలేశములు ప్రకాశకులవనియు చదువరులు గ్రహింతురుగాక.

త్వరలోనే 'హసీనా' కన్నియ ప్రణయగేయముల నాలపించుచు మా పాఠకుల పునర్దర్శనము జేసికొనవలయునని సంకల్పము. అంతవరకు సెలవు.

ఇట్లు,
కార్యదర్శి,
**సాధనసమితి.**

హైద్రాబాదు
తే॥ ౧౫ ఆగస్టు ౧౯౪౭.



# నవ్యకవితా నీరాజనము.

౧

కావ్యము లలితకళలలో నగ్రగణ్యము. లలితకళలను నాటకము తద్రామణీయకమును ప్రస్ఫుట మొనరించుచున్నది. లలితకళలు సౌందర్య ప్రధానములు. వానియనుభవము హృదయాహ్లాదకరము. శ్రావ్యమగు గానము వినినప్పుడు సుందర చిత్రము చూచినప్పుడు సరసమగు పద్యమును జదివినప్పుడు మనకు కలుగు దివ్యమగు నానందము అనర్వచనీయము అనుభవైకవేద్యము.

కళానుభవము మనశ్శాంతికి నమూల్యమగు సాధనము. మనస్సు కలతవడి చీకాకు నొందినప్పుడు తమయభిమాన కళోపాసనము చేత తాత్కాలికముగా దుఃఖవేదననుండి విముక్తులై తన్మయానంద మొందువారు కలరు. సంతోష సమయమున కళోపాసనము కళానుభవము మనయానందమును ద్విగుణీకృత మొనరించును. ఏకాంతముగానున్నప్పుడు, పనిపాటలు లేనప్పుడు, విశ్రాంతి కాలమున కళోపాసనము మనకాప్తమిత్రము. సుప్రసిద్ధ నటశేఖరుడు తాడిపత్రి రాఘవాచార్యులు “మనశ్శాంతిని బడయుటకు నాటకప్రదర్శనములు ముఖ్యసహాయముల”ని చెప్పి పై అభిప్రాయమును బలపరచినారు. నాట్యకళా ప్రపూర్ణుని పలుకులు లలితకళలకన్నింటికిని వర్తించును. అందు ముఖ్యముగా

కవిత రసిక జన చకోరములకు పూర్ణ చంద్రోదయము. కాని [illegible] పరమ పవిత్రమగు కవి ప్రపంచము సహృదయులకు మాత్రమే ప్రవేశ సాధ్యము. ఆ పుష్ప వాటి కాంతమునకు బ్రవేశించి యందలి యవనిని మొగ్గలను అరవిచ్చిన కుసుమ సుమచయములను కోరకమున గోసికొని వాని సౌందర్య సౌరభ్యముల మనసార ననుభవించి తన్మయులై యానందమున నోలలాడు భాగ్యము రసార్ద్ర హృదయులది మాత్రమే. కళోపాసకునికి ప్రకృతి యంతయు ప్రేమమయము, సౌందర్యపూర్ణము, ఆనందదాయకము.

రమణీయములగు నర్థములనిచ్చు సుందరపద సముదాయమే కావ్యమని చెప్ప నొప్పును. రామణీయకమనగా క్షణక్షణ నవ్యతనుజూపి మనల నానంద పరవశుల జేయు గుణము. నిక్కముగా కవిత కిట్టిగుణము సహజసిద్ధము. భాగవత మందలి గోపాలకృష్ణుని బాల్యక్రీడలు, గోపికా గీతములు భ్రమరగీతములు మున్నగునవి యిందుకు నిదర్శనములు. ఈ గ్రంథముల నెన్ని మారులు జదివినను తనివి దీరదు. మనము దానిని పఠించు ప్రతిపర్యాయమును అందేదో క్రొత్తదనము గోచరించును. ఈ క్రొత్తదనమే కావ్య రామణీయకమునకు ప్రత్యేక లక్షణము.

ఉద్రేకమే కవితకు ప్రాణాధారమని యొకానొక యభిప్రాయము. ఉద్రేకము లేనిది యే మహాకార్యమును నెర

ఆయన యొక్క దివ్య స్వప్నమున హాహాకార నాదములచే ప్రబోధితు డగుట భవ్యమగు కవితావేశ ప్రభావము. సామాన్యమైన గంభీరమగు భావనాశక్తి, ప్రహ్లాద గజేంద్రాదులతో సమైక్య రస పారవశ్యమున తన్మయుడైన పోతన్నది తన్మయ భావనాశక్తి. ముఖ్యముగా నీ యుత్కృష్ట రచనా సౌందర్యమునకు కారణము ఆవేశమే యని తెలియనగును. భావనాశక్తి నేఁ రూపమున ప్రత్యక్షమైనను దానికి ప్రోత్సాహ కారణము ఉద్రేకమే. పరమ పవిత్రమగు వైదికావేశమే కదా నన్నయార్యుని కావ్యమహత్వ మునకు హేతువు.

సహజ ప్రతిభాశాలియగు కవి సృష్టిలో నే వస్తువును దిలకించినను అతని హృదయమున నొక విధమగు నుత్సాహము జనించి, ఆవేశభరితుడగును. అప్పుడాతని హృదయమున కొన్ని భావములు జనించి రసోదయ మగును. ఈ విధముగా భావమునకు రసమునకు జన్యజనక సంబంధముగలదు. కవిత యందు భావ ప్రాధాన్యతను, ఉద్రేక ప్రాముఖ్యతను స్పష్టీక రించుటకొరకే నవ్యకవితకు భావకవిత్వమను నామాంతర మొసంగినారు ఆధునికులు. ఎవ్వాని హృదయము అపూర్వ ములగు భావములకు నిలయమో అదియే రసమునకు నిధా నము. రామణీయకమునకు పట్టుగొమ్మ. అట్టి

వాని డెందంబు పోకి పోవని తలపులు
వాని కనుసన్న తలలు నంపని రూపములు
వాని కలమున కుఱుకుజూపని పదములు

పందెము వైచుకొని రసమును మీరుచున్నారో యను సందేహము కల్గుచున్నది.

కవి సృష్టికర్త, ఆనంద సౌందర్యము లీ సృష్టికి ప్రత్యేక లక్షణములు.

"తమ్మిచూలు కేలు దమ్మి నిగల సేర్చు
కవికలంబునందు గలదుగాన
నీశ్వరత్వమతని కేచలామణియయ్యె"

కవి నిర్మితజగత్తు మన దైనందిన వ్యవహార ప్రపంచము నకు శుష్కనీరస సానుకరణముగాక ప్రతిభావంతమగు స్వతంత్ర నిర్మాణమే యనుట నిస్సంశయము. కవి ప్రకృతిని తన కవితా దర్పణమున ప్రతిఫలింప జేయవచ్చును. కాని తత్కార్య నిర్వహణమందు గూడ నాతడొక విధమగు నవ్యత, స్వీయ ప్రతిభ ప్రదర్శించుచున్నాడు. జుగుప్సాదులను, ధూమకలుషిత దుర్గంధములను తిరస్కరించి ఆహ్లాదరమణీయమును, సౌందర్య మాధుర్యములను గ్రహించును. "ప్రకృతియందు రమ్యము గాని వస్తుతతిని చిత్రకళలు రమ్యముగ దీర్చెడిని". అంతియేకాని కవి యంధుడై ప్రకృతిని నీరసముగా ననుకరింపడు. రమ్యముగా ప్రదర్శించుటలో కవి స్వీయభావనా మహిమను, నిర్మాణ కౌశలమును ప్రదర్శించి రవి గాననిదికూడ కవి గాంచునని తెలియజేయుచున్నాడు.

నీరు తీసిపోయిన తటినీ తటాలు
పొగలుపడ్డయినక మడుపులను చూచి

పానుష్వనుపీసీలేచ భామానికించ
గళిత సిత దుకూలాంచలమ్ముల

స్మరించుట కవి యొక్క నిర్మాణ నైపుణ్యమునకు నిదర్శనము.

స్వీయ నిర్మాణ జగమునందు కవి సర్వ సమర్థుడు. అందాతనికి దుస్సాధ్యమగు కార్యమే లేదు. దైనిక ప్రపంచమున దైవ సంకల్పమువలె కావ్య జగత్తునందు కవి కుమారుని సంకల్ప మమోఘము.

భావములను వ్యక్తీకరించు సాధనము భాష. కావ్యసంసారమున శబ్దార్థములకు గల సంబంధము మానవ ప్రపంచమునందలి దాంపత్యమును బోలును. వీనిలో నొకటి లేక యింకొకటి శోభిల్లదు. రెండింటి సంయోగమే ఫలప్రదము. భావమునకాహ్లాదమెంత ప్రధానమో శైలికి సౌందర్యమంత ముఖ్యము. కవిత ఆనంద సౌందర్యములచే విలసిల్లునది కదా! ఆనందము భావమున; సౌందర్యము శైలిలో. ఈ యానంద సౌందర్యముల సమ్మేళనమే రామణీయకము. ఏ విధముగ దుఃఖము, కరుణ మున్నగు రసముల ననుభవించుటలో ఆనందము కలదో, అదే విధముగ క్రోధాదులను వర్ణించు రీతులయందు సౌందర్యము కలదు. సందర్భములనుబట్టి శైలియు భేదించు. ఏ భావమునకు ఏ శైలియే వృత్తము అనుగుణ్యమో అది చక్కగా తెలిసి వ్రాసెను మహాకవి తిక్కన. కవుల యొక్క చోద్య ప్రయోగ కౌశలము, అన్నిటి

శబ్దావతారము దాల్చి, పాఠకులను శిరీష కుసుమపేశల సుధామ యోక్తులతో చిఱునవ్వు పెదవుల కందళింపఁ బలుకరించుచుఁ కావ్యము యొక్క శైలీ మాధుర్యమునకు ప్రమాణము శ్రవణ సుఖము. పరభాష పదములను స్వీయభాషా సంప్రదాయముల కనుకూలముగ అవసరము గలిగినపుడు పోహళించి స్వీయ భాషా ప్రబోధము జేయువారే నిక్కంపు కవులు.

కవులు నిరంకుశులు. వారికి "ఇదివలయును, ఇది కూడదు" అని యాజ్ఞాపించుట యసమంజసము. రసానుభవమే మనవిధి. అన్యములు మనకనవసరములు. భోజ్యములు రుచికరములుగా నున్నవియా యని పరిశీలించుటయే మనవిధి. కాని ప్రత్యేకపరిమాణయుక్తముగ లవణాదులను వాడవలయుననుట భావ్యముకాదు. ఇట నలంకారములు వాడవలయును, ఇటకూడదు అనియు, పాత్రములు ప్రత్యేక లక్షణములతో నొప్పారవలయుననియును విధించుట సహృదయ లక్షణముగాదు. కావ్యరచనకు కావలసినది సహజ ప్రతిభ కాని, కేవలము ఛందశ్శాస్త్ర పాండిత్యము, వ్యాకరణ వేతృత్వము కాదు. కావ్యము సహృదయుల కానందము గూర్చ గలదాయను ప్రశ్నయే ముఖ్యము; ఇతరము లసంభావ్యములు.

కావ్యములు నీతిబోధకములుగా నుండవలయునని యొకమతము ఉండిన నుండవచ్చును. కాని కావ్యప్రధానోద్దేశము నీతిబోధనము మాత్రము కాదు. నీతిని బోధింపక పోయినంతమాత్రమున నొక కావ్యమును రసప్రపంచము నుండి బహిష్కరించుట రసికసమ్మతము

గాను. కావ్యప్రధానోద్దేశము ఆనన్దోత్పత్తియనుటకు నీతిబోధనము విశేషయుక్తమైనట్లుండవలయును; గాన నీతివాక్యములయొక్కయు తాత్త్వికులయొక్కయు అనుభవము ననుసరించియే వారికి చరణాశ్రిత దాసిమైన కవితాకాంత యనాదిగ మెలసరింపజాలదు.

కవికి తాత్త్వికునకు కయ్యంబె సాగెను
బహుదినాలు వాక్ప్రపంచమునను
రాగ రక్తశ్లోకము, రాగ ముక్తశ్లోకము
సగుణ నిర్గుణముల సఖ్యమెట్లు?

మార్పు జగల్లక్షణము. మానవప్రపంచమున నిది విస్పష్టము. ఆదినుండియు మానవుడెన్నియో మార్పుల నందినాడు. సమస్త వ్యవహారములందే మార్పు సుస్పష్టము. సాహిత్య మీమాంసా మాన్య సూత్రమున కపవాదము కాజాలదు. ఇంతయేల? సాహిత్యమునకు మార్పే, నవ్యతయే శోభ గూర్చుననుట పరమసత్యము.

"కాలధర్మానుగతమై జగత్ప్రవృత్తి
మారునపుడు వాఙ్మయమును మారునిజము"

ఒక జాతియొక్క సారస్వతము ఆ జాతియొక్క జాతీయ జీవనము కద్దమువంటిది. కావున వాఙ్మయము ఒక పురుషాంతరము నుండి మరియొక పురుషాంతరము వరకు క్రమక్రమాభివృద్ధి నొందుచుండును. ఈ సందర్భమున రాయప్రోలు సుబ్బారావుగారి వాక్యములు ఉదాహరణ యోగ్యములు. "కవి యొక్క కర్మయే కావ్యము." అయితే కవులన నెవరు?

మంత్రద్రష్టలై ఛందస్సుల ననుసరింప జేసిన వైదికఋషులు కవులు; జ్ఞాన పారంగతులై యుపనిషత్తులనుపపాదించిన బ్రహ్మవాదులు కవులు; ఆనందోపాసకులై మానవ జీవిత మాధుర్యమును సంకీర్తన మొనరించిన కాళిదాసాదులు కవులు. అయితే యీ కవుల కందరకు ఏకాదర్శమే గోచరింపదు. లక్ష్య లక్షణముల రెంటను అంతర మగపడు చున్నది. ఆంగ్ల సాహిత్యమున గూడ నీ మార్పు విస్పష్టము. చాసరు షేక్స్పియరులు, మిల్టను కీట్సు ల కావ్యము లిందుకు నిదర్శనములు. నన్నయ, తిక్కనలు, ఎఱ్ఱనసోమనలు, శ్రీనాథ పోతనలు, పెద్దనసూరనలు, తెనుగు వాఙ్మయమున మార్పునకు త్రోవజూపినవారు. లక్ష్య లక్షణముల రెంటి యందును ఈ కవులలో నంతర మగపడు చున్నది.

సంఘ జీవితమునకు సాహిత్యమునకు వీడరాని సంబంధము కలదు. ఒక కాలమునందలి నాగరికత ప్రత్యేక స్వరూపమును దాల్చుటకు కారణములు, ఆ నాగరికతపైనగల యితర ప్రభావములు (influences) ఆ జాతియొక్క సాహిత్యమునందును స్పష్టముగా గన్పట్టును. అసాధారణ ప్రతిభాశాలియగు రచయిత స్వీయ వాఙ్మయము నందు నూత్న శకమారంభించి సమకాలిక సాహిత్యమునకు గ్రొత్త రుచులను గల్పించుటయు గలదు. కాని యెంతటి శేముషీ సింధువైనను సమకాలిక సంస్కృతి, విజ్ఞానము, ఆదర్శములు, నైతిక మానసిక విప్లవ

శక్తులు మున్నగువాని ప్రభావమునుండి తప్పించుకొనజాలడు. కవియొక్క వ్యక్తిత్వము, తత్కాలమందలి యాదర్శములు, వీని పరస్పర ప్రభావ పరిణామ ఫలితము సాహితీ చరిత్రమున నొక విలక్షణమగు నవ వధ్యాయమును ప్రారంభింప జేయును. ఇందుకు నవ యాధునిక కవి కుమారుల ఖండ కావ్యములు, భావకవిత ఉజ్వలోదాహరణములు.

అది యేమి చిత్రమోకాని ప్రపంచమునప్రతి సారస్వతమునకును ఆరంభము పద్య రచనయే. పూర్వకాలమున నేటి వలె విజ్ఞానము ఎక్కువగా నభివృద్ధి నొందక, ఉన్నది కొంచెము సరిగా ప్రబలక యుండుటవలన మానవుల హృదయశక్తి బలవత్తరమై యుండెను. వారి మెదడుకన్న హృదయమే గొప్పది. కావుననే కాబోలు గద్యరచనకన్న పద్యవాఙ్మయము, కవిత్వము ఆనాడు యెక్కువగా నభివృద్ధి నొందినది. ఆది కవులందరు పురాణములకే ప్రాముఖ్య మొసంగిరి. కావ్యములు, నాటకములు తరువాతవి. జనులకు మానవాతీతములగు విషయములందు రక్తియు, దేవతల మహిమయందు భక్తియునుండుటకు కారణమైయుండెనో పురు కవులును తమ కృతులు జనాదరణకు పాత్రములు కాలయునను తలంపుతో రచించుటచే ఆనాడు పురాణములు ప్రబలియుండెను. ఆకాలమున మతమునకు ప్రజాజీవితమునకును అవినాభావ సంబంధమే యుండెను. మతమునకు సంఘమునగల మహనీయ ప్రాముఖ్యము, మానవుల

నావేశ భరితులనుగా చేయుటలో జాని సామర్థ్యము, పురాణ రచనాకారణములలో నొక్కటియై యుండునోపును. కాలక్రమమున జనుల రుచిభేదమే సాహిత్యమందలి మార్పునకు కారణమయ్యెను.

ఆంధ్రమున నన్నయాదులు స్వతంత్ర కావ్యరచనా శక్తికి జాలినవారయ్యును పురాణముల నాంధ్రీకరించుటయందె సంతృప్తి నందియుండుటకు కారణములు దేశకాలపాత్రములే యనుట సత్యము. వైదికావేశమున సాంస్కృతిక బాహుళ్యం బను శైలిని భారతరచన గావించిన మహాత్ముడు నన్నపార్యుడు. రాజనీతి రహస్యములెరింగి తీపిగొలుపు తెనుంగున భారతరచన సాగించి ప్రబంధావళికి బీజముల నాటిన వాఙ్మయధురంధరుడు తిక్కనసోమయాజి. నన్నయ తిక్కనల విలక్షణ వ్యక్తిత్వముల సమన్వయించిన దక్షుడు శంభుదాసుడు. సోమన శబ్ద చిత్రమునకు ప్రాధాన్యమిచ్చినాడు. పాల్కురికి కవి జాను తెనుంగున తన రచనలను విలసిల్లజేసి స్వీయ భావ ప్రచారము నిరాఘాటముగా సాగించినాడు. శ్రీనాథ పోతనలు సమకాలికులు. కాని భాషాసేవ యొనర్చినది భిన్నమార్గముల. అక్కచెల్లెండ్రవలె భక్తిశృంగారములు వీరి రచనలయందు అల్లిబిల్లిగా నల్లుకొన్న రెండు తీగలవలె నొప్పుచున్నవి. సానలదీసిన జాతిరత్నములను సాహితీసుందరికి కానుకయొసంగినవారు పెద్దన రామరాజభూషణులు. కల్పనాచాతుర్యము సూరన్నది.

వర్ణనా నైపుణ్యము రామకృష్ణునిది. ఇట్లాంధ్ర సారస్వతమునగ ణనీయుడగు ప్రతి వ్యక్తియు స్వీయాభిప్రాయములను, ఆత్మవ్యక్తిత్వమునుప్రకటించుచు స్వతంత్రములగు దారులనుద్రొక్కి మా ర్పు వాఙ్మయలక్షణమని చెప్పక చెప్పినారు.

నిరసానకరణములు బింబప్రతిబింబ సద్రుశములగు ప్రబంధములు మనసారస్వతమున కొన్ని జన్మించినవి. పరంపరాగతములగు భావములే, పూర్వ ప్రబంధముల పోకడలేవానికి ముఖ్య లక్షణములు.

"శివుడుర్ తాండవ మాడనాడనెపిశాచీ భూత భేతాళముల్?"

శతక వాఙ్మయమొక్కటే యీకాలమున సాహిత్యమని చెప్పదగినది; అట్లుండ వచన వాఙ్మయమునకుపునాది వేసినవాడు చిన్నయసూరి. కాని తెలుగు వచనము చక్కదనముతో ముద్దు లొల్కినది వీరేశలింగయుగమున. వీరేశలింగము గద్యతిక్కన; అపరనన్నయ. మన వాఙ్మయమును సర్వాంగ శోభితను జేసినది వీరేశలింగంపంతులు. వారు "ఆంధ్ర సాహితీ పునరుద్ధరణ ప్రభావు"లగుట నిక్కువము.



# సంఘ సంస్కరణః నవ యుగోదయము.

శ్రీ వీరేశలింగ యుగమున సాహిత్యలక్ష్మి నూత్నశోభలతో విలసిల్లినది. ప్రబంధ కవిత్వాది శృంఖలా విమోచనమువలన కళకళలాడు నెమ్మోముతో చింపెసలారినది. నిడుదలగు సమాసములపై మక్కువమాయమైనది. చదివినను వినినను జనులకర్థమగు శైలిని అల్పపద పరికరముతో అనల్పార్థమును వ్యక్తీకరించు గ్రంథ సముదాయముపై ప్రీతి హెచ్చినది. రాజుల ఇష్టానిష్టములననుసరించి వారికనుకూలమగు రచనలు సాగించు కాలమంతరించినది. సామాన్యప్రజల జీవితమునకు ప్రాముఖ్యము హెచ్చినది. ఉద్రేకము కవితారంగమున ప్రముఖస్థానము నాక్రమించినది. జీవితకళతో సాహిత్యము తేజోవంతమైనది.

సారస్వత ప్రపంచమున వీరేశలింగము త్రొక్కనిత్రోవ లేదు. ఆయన బహుముఖ సారస్వత సేవకు ముఖ్య కారణము ఆంగ్లవాఙ్మయ సంపర్కము. ఆ కాలమున విశ్వవిద్యాలయములందాంగ్లేయ విద్యనభ్యసించిన విద్యాధికులు ఆంగ్లేయ భాషాభిరుచులను గలిగి ఆమార్గమున జేయబడిన రచనలను ప్రోత్సహించి, మరియు శ్రీ వీరేశలింగముగారిచే స్థాపింపబడిన యీనవీన సారస్వతోద్యమమున పాల్గొని భాషాయోషను మేలిసొమ్ములతో నలంకరించిరి. తెనుగున ఆధునిక పద్ధతులపై నాటక రచనకు పునాదులు వేసి గురుజాడ అప్పారావుగారికి మార్గదర్శియైనది, శ్రీ వీరేశలింగముగారి యమృత లేఖినియే. ఆంగ్లవాఙ్మయ సంపర్కముకతన నాంధ్రమున విషాదాంత నాటకము ఉద్భవించినది. రామకృష్ణాచార్యుల వారి విషాద సారంగధరమిట ప్రత్యేక స్మరణీయము. సాంఘిక

దురాచారములను ప్రకటించు నాటకములీ నవీనోద్యమ ఫలిత ములే. చారిత్రక సాంఘిక అద్భుత కథా ప్రధానములగు నవ లలు మన సారస్వత నికుంజమున మొగ్గ దొడిగినవి. రాజ శేఖర చరిత్రము, చిలకమర్తి వారి నవలలు, మాలపల్లి, ఇటీ వల అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణగార్ల రచన లిందుకు నిదర్శనములు. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, వేంకట లక్ష్మణరావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు మున్నగువారు వ్యాస రచనలో ఆత్మ ప్రతిభా సూచకమగు వివిధ మార్గము లను జూపినారు. ఈ విషయమును గూర్చి విపులముగా ముందు చర్చింతము.

దేశచరిత్రము, శాసన పరిశోధనయందు విద్వాంసులు శ్రద్ధవహించినారు. కవితావిమర్శనము పూర్వ పద్ధతులను విడిచి నూతన మార్గముల నడచినది. సంవత్సరాది సంచికలో విద్యా ధికుల వ్యాసములు, గ్రంథాలయ సర్వస్వమునందలి శాయప్రోలు వారి విమర్శనములు, దువ్వూరి, బసవరాజుల వ్యాసము లిందుకు నిదర్శనములు, కవిత్వ తత్త్వవిచారము, అనంత కృష్ణ శర్మగారి వ్యాసములు సాహిత్తీ విమర్శనమున క్రొత్తపద్ధతులను ప్రవేశపెట్టినవి. ఆంగ్లభాషయందువలె వసంతలేఖలు శారద లేఖలు పత్రికల నలంకరించినవి. కవిజీవితములు, వ్యక్తిచరిత్ర ములు, స్వీయ చరిత్రలు మనభాషయందు కూడ ప్రభవించినవి. ఈ నవీనోద్యమమునకు ప్రాణాధారము పత్రికా వాఙ్మయము.

ఆంధ్ర కృష్ణా పత్రికాధిపతులొనరించిన సేవ తెనుగు వాఙ్మయమున స్వర్ణాక్షరములతో లిఖింపదగినది. ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయములు తెనుగున నొకక్రొత్త శైలిని కళా ప్రపంచమున క్రొత్త రుచులను ప్రబలజేసినవి. భారతి, శారద, సాహితి, సుజాత, ఇటీవల ప్రతిభ మున్నగు మాస పత్రికలొనరించిన సేవగణనీయము. పైన బేర్కొనబడిన యన్నింటికిని మార్గదర్శి శ్రీ వీరేశలింగము పంతులే.

ఆనాడు సంఘసంస్కరణోద్యమ ఫలితముగా ఆంధ్రమున నెంతయో సాహిత్యముద్భవించినది. వీరేశలింగము బ్రహ్మ మతావలంబుడు, సంఘసంస్కారి, దక్షిణదేశ విద్యాసాగరుడు. ఆయన స్వభావములను తన రచనల మూలకముగా నాంధ్రావనిలో ప్రచారమొనరించినాడు. ఈ ప్రచారము ఆంధ్రులను మేలుకొలిపినది. ఈ విధముగా నవయుగోదయ మొనరించినాడు వీరేశలింగ దీక్షితుడు. ఈ నవయుగ ప్రభాతమున వీరేశలింగ మున కించుమించు సైదోడులగు వైతాళికులు, వేంకటలక్ష్మణ రావు, వేంకటరాయశాస్త్రి, వీరభద్రరావు, వడ్డాది వావిలికొలనులు, జయంతి గిడుగులు, తిరుపతి వేంకటకవులు, నాగేశ్వర రావుమున్నగువారు. లక్ష్మణరావుగారు నిజాంరాష్ట్రాంధ్రులు.

లక్ష్మణరావుగారు వివిధ విజ్ఞాన శాఖలయందు ప్రవీణులు బహుభాషాకోవిదులు. విజ్ఞానసర్వస్వ సంపాదకులై, విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపించి ఆంధ్రులకు విజ్ఞానభిక్ష పెట్టిన విజ్ఞాని లక్ష్మణరావు వేంకటరాయశాస్త్రి సంస్కృతాంధ్ర

ములయందు మహా పండితులు. ప్రతాప రుద్రీయము ఆయన శాస్త్రవేతృత్వమునకు, స్వతంత్ర నాటక రచనాశక్తికి నిదర్శనము సాహిత్య దర్పణాది గ్రంథములను రచించి నైషధ ఆముక్త మాల్యదలకు వ్యాఖ్యాన మొనరించిన యాతడు నిజముగా జంకు కళంకు లేని కవి చంద్రుడు. పాలితాశ్రిత కోవిదేంద్రుడు.

ఇరువదియవ శతాబ్దారంభమున ఆంధ్ర మహా పండితులలో ప్రఖ్యాత వ్యక్తిత్వము గలిగి, చారిత్రాత్మకములగు నిర్ణయములకు కారకులు జయంతి రామయ్య, గిడుగు రామమూర్తి గారలు. ఆంధ్ర మహా పురుషులలో వీరియువురకు ఉత్కృష్ట స్థానములు గలవు ఇరువురును ఉద్దండ పండితులు, విజ్ఞాన నిధులు. ఇరువురు కళా ప్రపూర్ణులే. ఇరువురి జీవిత పరమావధి భాషా సేవయే. ఇరువురు తమ ధర్మ నిర్వహణార్థము తమ సర్వస్వము ధారపోసినారు. ఇట్టి ఏకాశయ బద్ధులయ్యు వారు భిన్నమార్గానుయాయులు, వ్యావహారిక భాషను గ్రంథముల

కండమై నిలిచినారు పానగంటివారు. రామయ్యగారి వాదమును బలపరిచినారు. ఆంధ్రుల యశోవంతమగు చారిత్రను గంధస్థ మొనరించినవారిని భాస్వంతమగు భవిష్యత్తును నిర్మింప ప్రబోధించిన మహాశయులు చిలుకూరి వీరభద్రరావుగారు తిరుపతి వేంకటకవులు కవితకు స్వేచ్ఛావిహార మొసంగి ప్రజలలో వాఙ్మయాభిరుచిని పునరుజ్జీవింప జేసినారు. సారస్వతోద్యానవనమున వీరు కల్పించిన క్రొత్తవాదులనుండి యుద్భవించిన నూతన కవిత్వవల్లి నవ ప్రసవములను విరబూచినది. ఆధునికాంధ్ర కవులలో వీరికి శిష్యులో, ప్రశిష్యులో, ఏకలవ్యశిష్యులో కాని వారు లేరనుట అతిశయోక్తి కానేరదు. ఆంధ్రావనిలో పద్యరచనకు బహుళ ప్రచారము కల్పించిన వారలు తిరుపతి వెంకటకవులు. గంగాప్రవాహమును బోలు వీరి కవితావాహినియందు స్నానమాడి సాహితీ దేవాలయమున ఖండకావ్య కుసుమములతో ప్రవేశించినవారు నవ్యాంధ్ర కవి కుమారులు. వీరిని గురించి "వానలో దడియనివారు మద్గురువధానమ్మృదూక్తి మరంద ధారలోగడుగనివారు మా కెచట కానరారిల తెల్గు నాడునన్" అని వచించి నాడొక యాధునిక కవి కుమారుడు. ఇంకొక కవి మిత్రులు "ఎన్నడు రెండు పల్కాదవ దెవ్వని నాల్కకు మేరుధీర భావోన్నతుని రసార్ద్ర హృదయున్ దరియించుట మన్ననగాంచ నాంధ్రి" అని ప్రశంసించి తమ సౌందర నందమును నీరిడినట్టి భక్తి యిదే నీకె యొసంగెదమని కళా భరణముగా నర్పించినారు. తిక్కన చేతనల యనంతర

మిట్టి రమణీయ దృశ్యము ఆంధ్ర సాహితీ చరిత్రమున వేరొక్కటి గానరాదు. సుప్రసిద్ధుడగు సింకొాక కవి శేఖరుడు.

ఇలుదాటి నీవు రావలెగాని
నీ పదంబుల నమస్కృతులతో మునిగి తేలు
మతిసెంచి నీవు సమ్మతి జూపవలె గాని
ఓరుదాళి నీ రొమ్ము తురగలించు
చేసాచి నీవు యాచింపంగవలె గాని
మణులతో నీ కొంగు తొణగి పోవు
తల పూని నీవు చే కలమందవలె గాని
సిసమైన కవనంబు చెంగలించు

అని సముచితముగా ప్రశంసించినాడు.

ఈ విధముగా నాంధ్రులు మేలుకొని నూత్న ప్రభాతము నాహ్వానించినారు. ఆసమయమున దేశీయ మహాసభ ఆంధ్రుల హృదయ క్షేత్రముల స్వాతంత్ర్య బీజముల నాటి వారిని వీర పూజా తత్పరులను గా నొనర్చినది. ప్రకాశము, పట్టాభి, సాంబమూర్తి, నాగేశ్వరరావులవంటి యాంధ్రమహా నాయకులు ద్భవించిజాతీయోత్సాహము నినుమడింప జేసినారు. ప్రజలలో స్వతంత్ర భావములు ప్రజ్వరిల్లినవి. తత్ఫలితముగా జాతీయ వాఙ్మయము జనించినది. ఆంధ్రమహాసభ ఆంధ్రత్వము ప్రబోధించినది. ఆంధ్రరాష్ట్ర సమస్య ప్రాముఖ్యము నందినది. రాష్ట్ర సంపాదనార్థము ప్రబోధ వాఙ్మయము పెరిగినది. శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి రాష్ట్రగానమిట ప్రత్యేక స్మరణీయము. గాంధీ యుగ మారంభమై 'సత్యము'

చూడుము మును మును మేటివారల మాట
లన్నియెడ మంత్రి మహిమను జాతిబంధము
లన్ని గొలుసులుజారి సంపదలబ్బెనుర్.

ఎల్లలోకము నొక్క యిల్లై
వర్ణభేదము వెల్లకిల్లై
వెలనెఱుంగని ప్రేమబంధము
వేడుకలు కురియ
మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలిచి పోవును
అంత స్వర్గసుఖంబులన్నవి
యవని విలసిల్లున్.

అని గురజాడ వారి వాక్కులవంటివి ఇతర ప్రముఖుల రచనలయందును కానఁగును. వంగ వైష్ణవ గీతములందలి రక్తి, ప్రేమ, ప్రకృతి పురుషుల లీలా విలాస వర్ణనము వేంకట పార్వతీశ్వర కవుల ఏకాంత సేవయందు కానన గును. బ్రహ్మసమాజ ప్రాబల్యము కృష్ణశాస్త్రి గారియందు గోచరము. వైష్ణవ సంప్రదాయమందలి ప్రేమయే కాబోలు నవ్యకవుల రచనలయందు గోపాలకృష్ణుడు, వేణుగానము, రాధ మిక్కిలి ప్రాముఖ్యముగలిగి రసికుల హృదయముల కాహ్లాద ముగలిగించుట. రాధాకృష్ణుల మధుర ప్రణయమును గూర్చి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి. శృంగారవీథి, పోతనా

మాత్స్యాని భ్రమరగీతాదులు మన భావకవి కుమారుల రాధా కృష్ణుల ప్రణయ సంకీర్తనమునకు కొంతవరకు కారణమేమో! పోతనార్యునివలె నవ్యులను ఉద్రేక ప్రధానవాదులు.

ఈ ప్రోద్బలములన్నింటిలో నెన్నదగినది ఆంగ్లసారస్వత ప్రోద్బలము. భిన్న నాగరికతా సంపర్కము భిన్న సారస్వత సంబంధము ప్రతి సాహిత్యము నందును విప్లవము కలుగజేసి తీరును. ఈనాటికి తెనుగు సారస్వత వాహిని సంస్కృతాంగ్లేయ వాఙ్మయ వాహినులతో సంగమించి త్రివేణీ సంగమ సౌందర్యమును, ధిక్కరించుచున్నది. ఆంగ్లభాషా వ్యాసంగము ఆంధ్రభావ కవికుమారులను స్వేచ్ఛానురక్తులుగను ఆశయ పూరితులుగను జేసి సహజ భావనా మహిమకు దోహద మొసంగి ఉజ్వలభావ పూరితములగు రచనలను దీపింపజేసినది. ఆంగ్ల సహాయమున విశ్వ సాహిత్యముతో సంపర్కము కలిగి ఆంధ్ర సాహితీ దృష్టి విశాలమైనది. నవ్యాంధ్ర కవితకు ముఖ్యాంగ్ల సాహితీ ప్రోద్బలములు వర్డ్సువర్తు షెల్లీకీట్సు రచనలని చెప్పవచ్చును. (Wordsworth) ప్రకృతి ప్రేమ, ప్రకృత్యుపాసన కీట్సు భావసౌందర్యము, భాషా మాధుర్యము షెల్లీ స్వాతంత్ర్యదాహము, ఆధ్యాత్మిక తృష్ణ, అస్పష్టతా మాధుర్యము అభినవాంధ్ర కవి కుమారుల యందు పుష్కలముగా లభించును. ఈ ముగ్గురు కవుల కావ్యరీతి యందలి శ్రావ్యమగు సంగీత ధ్వని మన యాధుని

కాంధ్రకవుల రచనలయందు గానవచ్చును. పైన పేర్కొనబడిన యాంగ్ల కవికుమారులయందు నీతికన్న రసపోషణకే యగ్రతాంబూలము; మరియు పరాసు విప్లవమునకు ఆంగ్ల వాఙ్మయమునకు గల సంబంధము వంటిదే గాంధీ తత్వమునకు మన నవ్య కవికుమారుల స్వాతంత్ర్య భావములకు గల సంబంధము. ప్లేటో తత్వము ఆంగ్లభావ కవికుమారుల నేవిధముగా నాకర్షించి వారి ప్రతిభకు దోహద మొనరించినదో అదే విధముగా వైష్ణవ గీతముల భక్తి ప్రేమలు మన కవుల భావనా శక్తిని విజృంభింప జేసినవి.

కాని నవ్య కవుల రచనలు ఆంగ్లభావ దాస్య పరిణామములు, తదనుకరణానుసరణములని చెప్పుటతప్పు. వీరి రచనలు సహజ ప్రతిభకాలవాలములును ఉజ్వల భావనా మహిమచ్ఛ ప్రదీప్తములును అని తెలియనగును. ఈ రచనలలో తెనుగు దనము మూర్తీభవించి యుండును. స్వీయభావ ప్రధానములగుటచేత వీరియందు విలక్షణ వ్యక్తిత్వము ప్రస్ఫుటము. ఈ భావ వైలక్ష్యమేకాక శైలీ ప్రత్యేకత ఆధునికరచనల విశేష గుణము. ఆంగ్ల భాషావ్యాసంగము కొంతవరకు వీరి కవితా శక్తికి దోహదమొనరించినది. అంతియ.

"ఇరుగు పొరుగు సీమలలోన
మెఱుగులొలయు పలుకులను
జాతి సానల పలకదీర్చి, తెనుగు

బంగారు తీవె సూత్రింతు రెలమి
చేత నాహ్లాద రమణీయ చిత్ర రచన"

అంత మాత్రమున తెనుఁగు సరస్వతీ సౌందర్యము స్వీయ ప్రత్యేకత కోలుపోవదు. తెనుగు దనము భావ కవి కుమారులు మిక్కిలిగా ప్రేమించి పోషించుకొను గుణము. కావున వారు భాషా వస్తూటి కొనంగు భూషణములు ఎరువు సొమ్ములుకావు. విశిష్టమగు భావనాశక్తిచే నుద్దీపింపబడి భవ్య మగు నావేశ ఫలితములగు వీరి రచనలు గంభీర భావ శోభిత ములై సౌందర్య విలసితములై తద్రచయితల సహజ సామర్థ్యము వ్యక్తీకరింపుచున్నవి.

ఆధునిక కవితయందు కవి హృదయము ప్రతి బింబించును. కవి యొక్క ఆశయములే, సామాజికములగు పలువిషయములను గురించిన యాతని భావములే నవ్యకవిత యందు గోచరించును. కవి పరోక్షముగా నేదోయొక సంద ర్భమును కలిగించుకొని కాక ప్రత్యక్షముగా పాఠకుల నుద్దే శించుట నవ్య కవుల యలవాటు.

"నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు
నాయిచ్ఛయే గాక నాకేటి వెరపు"

అని పలికిన భావ కవీంద్రుని

"నావలెనె యాతడున్మత్త భావశాలి
ఆగి కోలేడు రేగునూహాలనొకింత
ఇంత చిఱుగీతియెద వేగిరించునేని"

పాడుకొనును, తాండవనృత్య మాడుకొనును, అను వాక్యములిట నుదహరణ యోగ్యములు. భావకవితలో కవి యొక్క భావములకే ప్రాధాన్యత

"నా కనుల యెట్ట యెదుటన నా జనకుని
జనని కుత్తుకలను గోసినను నడిగె నతండు
నే దయాంబుధినిగాదా యటంచు
ఓ ప్రభూ! నీవయంటి నే నొదిగియుండి;
నా కనులయెట్ట యెదుటన నా లతాంగి
ప్రాణములు నిల్వునం దీసినను నడిగె నతండు
నే దయాంబుధినిగాదా యటంచు
ఓ ప్రభూ! నీవయంటి నే నొదిగి యొదిగి;
నా కనులయెట్ట యెదుటన నా యనుంగు
తనుజు కుత్తుకనులిమి తానను నడిగె న
తండు నే దయాంబుధినిగాదా యటంచు
ఓ ప్రభూ! నీవయంటి నే నొదిగిపోయి;"

అని యాదయాంబుధి పాద పంకజముల కడ మోకరిల్లిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారును,

'నా కవితా వధూటి వదనంబు నెగాదిగ జూచి రూప రేఖా కమనీయ వైఖరులగాంచి భళీ భళి యన్నవాడె, మీదే

కులమన్న ప్రశ్న వెలయించి చివుక్కున లేచిపోవుచో,
బాకున గ్రుచ్చినట్లగును పార్థివ చంద్రి వచింప సిగ్గగున్.

అని హృదయా వేదనను వెలిబుచ్చిన జాషువా కవి వరుడు యీ విషయము నిరూపించుచున్నాడు. ఈ కవులు ఆవేశ పూరితులు గాక, వారి హృదయములందు రసోదయము కలుగక కవితా రచనకుపక్రమింపరు. గాన వారి రచనలలో భావములంత యుత్కటముగా హృదయమునుండి దూసికొని వచ్చునవిగా నుండును. చూడుడు,

"ప్రకృతిని తనలోన నాకు గన్పడగనీక
దాచుకొన్న దనూజు చేతను మదీయ
హృదయ రాజ్యాధినాథుని విడియనీక;
ఏను ధరియింపగాజాలనీ దురంత
కుటిల దారుణ కార్య సంఘటన మింక
ఎవ్వరని ప్రకృతినన్ను ఊహింతు వీవు
అంధకారము నల్దెస లావరింప
కంపిత నిశీధ మేఘ సంఘములు గ్రమ్మ
భయద మాలిక చేత సర్వ ప్రపంచ
రాజ దండము ధరియించి ప్రతిభతోడ
మేరుభూధర శిఖర సామీప్య భాగ
పీఠికను గొల్వుదీరి నభీతి దవిలి
తతమహార్ణవ ఘోషయే శ్రుతిగ జేసి
సర్వ పైశాచగణము సంస్తవము సేయ

చండ్రనిప్పుల గనుల శాసనము వ్రాసి
కడగి బంధింతు సర్వలోకాల నేను
సకల మతశాస్త్ర పారవిస్తార కలిత
నిజమనోరథ భగ్న గంభీరవుడను
వసల నాతని జూపించి గపలిపాత్ర
మన్నిశిత వీక్షణ నిపాత మార్గణముల
గొరలి యెన్వడుబోడు ప్రకృతి నిజంబు
కాప్ర నాస్వామి జూపి చవెసి విసమూ
అగ్నికణముల రాలు నేత్రాలతోడ
వేడి నిశ్వాసములను కెంపెదవులదరి
తనువు ఆపాద మస్తకంబును మహోగ్ర
గతిని గంపించి పోవ దుర్గతివిగాన
నీదు వైభవము నిన్నుబూదిగాగ
నిపుడె భీషణగతి శపియింతు నేను"

ఉత్సాహము ఆవేశము, ఉద్రేకము నవ్యకవితకు ముఖ్య లక్షణములు. ఆవేశ సాగరమును నిగ్రహసహాయమున నీదు వాడు కావ్యకర్త. ఏ సహాయమును లేక ఆవేశ మ్మెవైపున కీడ్చిన ఆ వైపునకు దిరుగువాడు భావకవి. కావున కథాచమత్కారము, వర్ణనా నైపుణ్యము, పాత్రపోషణ నవ్య కావ్యములందంతగా గానరావు. రసానుభవమున నార్ద్ర హృదయుడైన కవి కుమారుని లేఖినీ విన్యాసమే నవ్య కవితా విలాసము.

ఆంగ్లేయ కవులతో నవ్యాంధ్రి కవులకు కొన్ని పోలికలు కన్పట్టుచున్నవి. ఆంగ్ల వాఙ్మయమున వలె తెనుగునందును స్మృతి కావ్యములు గోచరించుచున్నవి. దువ్వూరి రామిరెడ్డిగారి 'భగ్నహృదయము' విశ్వనాథవారి "వరలక్ష్మీ త్రిశతి" యీ కాటి స్మృతి కావ్యములలో నగ్రగణ్యములు. స్పెన్సరు, మిల్టను, షెల్లీ, అర్నాల్డు మున్నగువారి చేతుల యందు నిగ్గులు దీరిన గోపకావ్య (Pastoral) ప్రభావము రామిరెడ్డిగారి "వనకుమారి" యందు కానవచ్చును. మర్మకవుల (Mystic poets) యస్పష్టతా మాధుర్యము శ్రీ రాయప్రోలు వారి కృతులయందు కన్పట్టును. ఆంగ్లేయ కవులవలె నవ్యాంధ్ర కవులుగూడ సౌందర్యారాధకులు. జీవితమునందలి సామాన్య విషయములందు గూడ వీరు కవితా కన్య సౌందర్యమును దర్శింతురు. "అర్ధరిపురుగు," "గిజిగాడు" మున్నగు మనోహర ఖండకావ్యములిందుకు నిదర్శనములు,

"సరస చైతన్య రంజిత జగతియందు
కవి గ్రహింపగ రాని వస్తువులు గలవె?
రాళ్ల నేడ్పించు పక్షి విరహాలు భాతి
పిల్లచే జోలబాడించు తల్లి యట్లు"

ఆంగ్ల కవులవలె మనవారికి పూర్వఛందో రచనల యందు కొంత యసంతృప్తి కన్పించు చున్నది. ద్విపద, ఆటవెలది, తేటగీతులకు తెనుగులో గలిగిన ప్రచార బాహుళ్యము,

గురుజాడవారి 'ముత్యాల సరములు,' అబ్బూరి రామకృష్ణారావుగారి నూతన ఛందోబద్ధములగు రచనలు యీ విషయమునకు దృష్టాంతములు. ఆంగ్ల భావ కవితా యుగమున తత్సాహితీ విమర్శనమందు గూడ చారిత్రాత్మకములగు మార్పులు కలిగినవి. శబ్ద విచారములతో సంతృప్తినొంది, సాంకేతికములును, పాండిత్య ప్రదర్శనములును అగు జాన్సను, పోప్సుల విమర్శన లంతరించి షెల్లీవంటి రస హృదయుల సరస విమర్శలు ఆంగ్ల భాష నలంకరించినవి. తెనుగు విమర్శనా సాహిత్యమున గూడ నిట్టి మార్పు విస్పష్టము. ప్రకృత్యువాసనా ఫలితముగ నాంగ్ల సారస్వతమున పరంపరా గతములు, సాంకేతికములునగు బంధనములు విడిపోయి మానవ జీవితము యొక్క నిష్కాపట్యము సరళత, అమాయకత కవితా రంగమున ప్రధాన పాత్ర నభినయించినవి. బ్లేకు, వర్డ్సువర్తు వంటి కవులు శైశవము నారాధించిరి. Coleridge, simple unsophisticated nature ను కవితాగాన మొనరించెను కాపు కవియగు Burns ను ఇట్టివాడే. దీనుల యెడదయ పేదలయెడ కరుణ బర్న్సు కవితలో ప్రధానములు. ఈ కవుల యందు పాండిత్య శౌండీర్యమునకన్న సరస సాహిత్యమే అధికము. పై విషయములన్నింటియందును ఆంధ్రాంగ్ల కవులకు సామ్యముకలదు. సమకాలీనములగు నవీన భావములు, సామ్యవాదము, హరిజన సమస్య, ఖద్దరు, రాట్నము, వైరాగ్య

రాహిత్యము, రాజసగుణ ప్రాధాన్యత ముఖ్యముగా ఉమరు ఖయ్యాం ప్రభావము] నవ్య కవితాలక్షణములలో కొన్ని.

భావరంగముననే కాక క్రియారంగమునందు గూడ స్వాతంత్ర్య కాములు నవ్యకవులు. భవభూతి వీరికి మార్గదర్శి.

"ఈ వినూతన భావముల్ తావిలేని
పువ్వులని యంధలోకమ్ము నవ్వినన్ను
ఈ దిగంత ప్రణయ రేఖ పాడనైన
మధువు లూరించుచో నాదు హృదయమందు"

భావి భారత ప్రత్యూషమును గాంచి యువ్వొంగ గల యుత్సాహశీలురు వీరు. ఆంధ్రుల మహాసత్త్వుల చరిత్రము "చావలేను, చావలేను." అని ఢంకాగొట్టి వచింపగల యాత్మ విశ్వాసము వీరికి గలదు. "భృత్యతామిషమునన్ దేశంబునం దెల్ల నింతకు ధర్మంబులు గాగ నెన్నబడు సన్యాయంబు లీనాటితో వికలంబై చనుగా కయంచు కరుణావేశంబు దీపింప" ఒలికెడు స్వాతంత్ర్యదేవి వీరికారాధ్యదేవత. కావుననే వీరిదృష్టిలో పూర్వులు గూడ

"పేదల రక్త మాంసములు పెంపు వహించి దయారసా వృత దాదరిద్రులైన ధనవంతుల పెద్దరికమ్ము కై, మతోన్మాదము పెంచు దేవునికి మారుగ నిల్చిన రాతి బొమ్మల"

పూజించు నిమిత్తము గాని, "లలనాజన తాకబరీ భరైకభూషా కలన" గాని కాంక్షింపక "మాతృదేశ సేవాచరణమ్మునం దసువు లర్పణ సేయగజాలు పార్థివ శ్రీ చెలువారు చోట" గాలి పోఁకోరును. మాతృదేశము, మాతృభాష వీరికి పూజ నీయములు.

"పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండుగర్వంబు
లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరులింకెందు
ఏపూర్వ పుణ్యమో ఏ యోగబలమో
జనియించినాడ వీస్వర్గ ఖండమున
ఏమంచి పూవులన్ బ్రేమించి నావో
నిను మోచె నీతల్లి కనకగర్భమున"
అనియు, "కలదయేని పునర్జన్మ కలుగుగాక
మధుర మధురమైన తెనుగు మాతృభాష"

అనియు పొంగి పోదురు. ప్రకృతి శోభా విలాస లాలసులగు నీకవులు, వసంత వికాసము, శేష చైత్రము, జలదాంగన కంకణము, మందారశిశు, చందమామ, గరిక మొదలగు వానిని గూర్చి రమణీయములగు భావములను బ్రక టించిరి, గొల్లవాని గోడవలు, కాపువాని జీవితము,

బ్రాహ్మణ సంసారము, జానపదుల సరససల్లాపములు, పేదల కష్టములు, యీ నాటి కవుల కావ్య విషయములుగా నున్నవి.

నవ్యుల శృంగారము అతిలలితము, మిగుల సున్నితము. కచకుచాది వర్ణనలకందు తావులేదు. ప్రియురాలి శాంత మనోజ్ఞరూపము, తిలకపాటల ఫాలమండల దీప్తిజాలము, కాంచనహార విలసత్కంఠ దేశము ఇవియే వీరు వర్ణించి చిత్రించునవి. వీరి ప్రేమ సిద్ధాంతములు మిక్కిలి పవిత్రములు. సంభోగ శృంగారము నాశ్రయించునవి కావు. ప్రేమయంత రంగముల నతిక్రమింపజాలినది. కాయసాయుజ్యము అంత ముఖ్యముగాదు. ఆధునికుల వర్ణనా పద్ధతియు నూతనము. చెదరిన సౌందర్యము, సహజ సౌందర్యము వీరికి ప్రియములు. అంగవర్ణనమేగాక గుణవర్ణనయు వీరియందు గనుపించును. ఆధునికులు స్త్రీని పత్నియను భావముతో కాక తల్లిగను సోదరిగను ప్రేమించి యారాధింతురు. ప్రేమకు స్థాయీభావము సంభోగమొక్కటే కాజాలదు. కావుననే,

"తల్లి వక్షస్స్థలంబున స్తన్యమాని
నిరవధిక తుష్టి విశ్రమే మఱచు శిశువు
క్షీర కోమలగండ శృంగార చుంబ
నముల నొసగెడు తల్లికిన్ ప్రమద పులక
స్నానమాడి పెన్నెరులు జాఱమడిచి
నొసట కుంకుమ పాదాల పసుపు మెఱయ

స్త్రీ కోటి కొలిచి తులసిని భజించు
ధీరభావము మాత్ర శృంగారమౌను.
స్నానమాడి సుభగ సంస్కార హీనమైన
సోదరుని కేశముల్ దువ్వుచుఁ మృదూప
లాలన మొనర్చు సోదరీ లలిత సరణి
ధారగిలు నీదృగంపు శృంగార రుచులు
భువన సమ్మోహనుండైన పురుషుఁజూచి
ఇతనినిచ్చిన తల్లి యమృత కలశము
లెంత ధన్యములోయని యిచ్చ మెచ్చు
సతుల నెఱుఁగ మెందరిని వాత్సల్యరతుల."

అని పవిత్ర శృంగార రసోపాసనము గావించినారు, అభినవాంధ్ర కవి కులమునకు ఆచార్యుడు. వీరి శైలియు క్రొంగ్రొత్త సొబగులచే విలసిల్లును. శ్రవణసుఖము నొసంగు మృదుల సరళాక్షరముల సమ్మేళనము వారి శైలికి విలక్షణ గుణము.

శైలిలో మృదుత్వము సాధించుకొరకు సంధులు విసంధులైనను సాంస్కృతములు దేశ్యములతోడ సమసించినను, వారు సరకుసేయరు. అందు నిమిత్తము వారు ఇతర దేశీయములను గూడ మన భాషా సాంప్రదాయముల ననుసరించి వాడుట కలదు.



# 3

# భావ కవిత్వము; ఖండ కావ్యములు.



ఈ విధముగా నాంధ్ర సారస్వతమున ఖండకావ్య మహోదయము తొలకరించినది, సాహిత్య స్థాపకులగు కవిభూషణ ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారి రచనలతో. నవ్యాంధ్ర కవితా సాధనమునకు పునాదులు వేసి ఒక్కమహా విప్లవము కలిగించినది, శ్రీ సుబ్బారావు గారి లేఖినియే. గురుజాడ అప్పారావు గారి "ముత్యాల సరముల" కూర్పుతో సారస్వత ప్రపంచమున కొంత సంచలనము కలిగినను వారి ఆశయము భాషాసంస్కరణ, సంఘసంస్కరణములే. సుబ్బారావుగారి యందు సమృద్ధిగా విలసిల్లుచున్న నవ్యత, రామణీయకము, భావసౌందర్యము, భాషామాధుర్యము అప్పారావుగారి రచనల యందు గోచరింపదు. భావమున, భాషలో, రచనావిధానమున, గ్రంథ నామకరణ కార్యమున, ఒక్కటియననేల, ప్రతి విషయమునందును తెనుగుకవితను ఆమూలాగ్రముగ మార్చి నూత్నశోభలను ప్రవేశపెట్టినది శ్రీసుబ్బారావుగారి దివ్యలేఖిని. నిజానికి భావకవితాసామ్రాజ్యమునకు పట్టభద్రుడాయన. నిజాంరాష్ట్రమునకాయన పెంపుడుకొడుకు. పాయలు

పాయలుగా విడిపోయిన తెలుగు కన్నియ ముంగురులకు వేణి యోగ్యాభరణముగా ఆయన జడకుచ్చులల్లి యిచ్చినాడు. ఆమె మణిబంధమందు తృణకంకణము భక్తితో సమర్పించినాడు. మరి కొన్ని కావ్యసుమములను మాలికగా గూర్చి యామెకంఠమున వేసినాడు.

ముద్దులుగులుకు వారిరచనల దెరచి యటనట యేవేని కొన్ని పద్యములను పఠింపుడు. ఆంధ్ర వాఙ్మయమున కొంత కాలమునుండి కని యెరుంగని నూతనత్వము, విలక్షణమగు వ్యక్తిత్వము సుస్పష్ట మగును. ప్రకృత్యుపాసకులు గావున వీరు గ్రంథారంభమున కృత్యాద్యవస్థల ననుభవింపక, ప్రకృతిని పులకాంకిత గాత్రులై ఉత్సాహపూరిత హృదయముతో నేవిధముగా స్తుతియించినారో తిలకింపుడు.

"మామిడికొమ్మమీద కల మంత్రి
పరాయణుడైన కోకిల
స్వామికి మ్రొక్కి యీ యభినవ
ధ్వని ధారణకుద్యమించితిన్

... ... ...

శశివికశించిన శ్రావణ
నిశీథమున గానబడిన నీరద సుతకున్
ప్రశమిత మతినై యీ ప
ద్య శుభాంజలి నొసంగితి ప్రణయార్పణమనుచున్."

అంతేకాదు,

"అణువునజాండము నేక స
రణి నిండారిన మనోహరపు వాగర్థ
ప్రణయము గీర్తించెడి మృదు
గుణుల భాషా కుమార కులనుతిఖింతుః.

శాశ్వత నవ్యస్ఫురణల
నశ్వరలావణ్యమై యొనయు కావ్యకళా
విశ్వమునందానందర
సైశ్వర్యము లేలు కవిత కంజలి యిత్తుః."

అని కరయుగమును బంధించి కావ్యరచనకు ప్రారంభించుట భవ్య భావానుభవము కతనహృదయము ఆర్ద్రమై రసోదయ మగుటయే కారణము. తెనుగు సాహిత్యము న వలంబించిన నూత్న మార్గమును గురించి కవి భూషణులే యీ విధముగా వచించియున్నారు "హ్లాదైక మయమగు కావ్యమువలన నర్జింపదగిన పరమ ప్రయోజనము ఆనందము. ఆ ఆనందోపాసన గావించువాడే భావకవి. వస్తు సంవరణ మునందు భావకవికి తన స్వానుభవమే యధికరణము. భావ కవిత్వమున స్త్రీ మాతృకీరమునం దాసీనురాలగును. ...... ......అతివిశాలమగు నాత్మదేశమునందు తనయనంత మాతృ భావమును మూర్తీ భవింపజేయును. ఆ అనాది పితతో వికల్ప

జగన్మయుడైన తానెట్లు మెలగవలయునో [కవికి] బోధపడుటలేదు. కావున తండ్రిని సాక్షిగానే వదలి తల్లిని ప్రత్యక్షదైవముగా సమీపించుచున్నాడు. తనకు యిష్టదైవము దేశము ఆమెకు ఆప్తపుత్రుడు తాను."

అంతస్సున్న రసస్పందనముగాక కవితా దర్శనము గాదని సుబ్బారావుగారి మతము. వీరి కావ్యము లిందుకు మేలి నిదర్శనములు. ఈ విషయమున నాంగ్ల భావకవి సామ్రాట్టులగు షెల్లీకీట్సులతో వీరు తులదూగుచుందురు. వారొనరించిన ఆంధ్రులయశోగాన మీ విషయమును వ్యక్తీకరించుచున్నది. ఆ కావ్యగానమున ఉత్సాహమే, ఆవేశమే ప్రత్యక్షరమందును ప్రత్యక్షమగుచుండును. చావలేదు, చావలేదు ఆంధ్రుల మహోజ్వల చరిత్ర అస్మదార్ద్ర మనోవీథినా వహింప శక్తి కలిగించుచున్నాడనని పలికి "ఆంధ్రసంతతికే మహితాభిమాన దివ్యదీక్షా సుఖస్ఫూర్తి తీవరించె ఆ మహావేశ మర్థించి యాంధ్రులార చల్లుడాంధ్రలోకమున నక్షతలు నేడు" అని నిద్రాముద్రితులైన సోదరాంధ్రులను ప్రబోధించినారు.

మన పితామహమాతామహోపనిధుల శౌర్యప్రసక్తి, రసవశంకర నాగరరాగరక్తి, దూరదేశమందలి అన్యజాతుల నుద్ధరింపజాలిన వారి ప్రతిభావిశేషము, నిజాంధ్రజాతి తంతు విచ్ఛేదము సలుపజాలునని వారుఘంటా పథముగా

వచించుచున్నారు. సంగీత సాహిత్య కళలను ఉగ్గుపాలతో ద్రావియుమిసిన యాంధ్రులను జగన్మోహనాస్త్రములభ్యసింప సందేహమేలయని వారు ప్రశ్నించుచున్నారు. విమలసాహస సౌకుమార్యములను దిఙ్మతంజముల చిత్రించిన శ్రీగణపతిదేవుని భార్య రుద్రమదేవి మున్నగు తెనుగు పడుచుల చరిత్రము జాతిచైతన్యము కొరకు పఠింపవలయునని శాసించుచున్నారు. విజయకన్యకు వీరగోరజము బూసిన బలభద్రులు మనపూర్వులు పులికడుపున చలిచీమ పుట్టునగునే? ఒకనాడు మనయింటి పడుచు జతలు చిలుక సరస్సులో శృంగారనౌకలు నడిపిరి. నిత్యకల్యాణము పచ్చతోరణముగ సాంగగీత కల్యాణ శాఖ క్రింద ఆనంద దేవతనుపాసించిన ఆంధ్రుల మహోన్నత్యము కవిభూషణులు నోరూర నోరార కీర్తించి ఆంధ్రుల చెవులలో ఉత్సాహ మంత్రము నూదినారు. కులమువదడువక పొలిమేర గోలబడక నాజాతి, నా దేశము, నాభాషయను అహంకార దర్శనమందుమని ప్రబోధించినారు 'జన్మభూమి' యని వారు వ్రాసినగీతము తెలుగువారికి మహాదాంధ్రమున జాతీయగీతముగా నుండదగినది. శ్రీసుబ్బారావుగారు సౌందర్యోపాసకులు. అపూర్వములగు వీరిసౌందర్యవర్ణనలు నవ్యాంధ్ర సారస్వతమునకు భూషణ ప్రాయములు.

కృత్రిమాలంకార శోభితముగాని సహజ సౌందర్య వైభవమే సూర్యనారాయణ శాలీనునికివలె వీరికిని ప్రియతమము. వీరి

సౌందర్యము 'విరిసిననొక్కయొప్పు అరవీడిన వేరొకయొప్పు కొప్పుగాబరగిన నొక్కయొప్పు' వేణిభావరచన నొక్కయొప్పు అను సూరనార్యుని పద్యమును జ్ఞప్తికిదెచ్చును. 'జిలుగు పూలకలంకారి చీరజార' జారు చెమ్మట ముత్యాల జంపు సరులతో నరుగుచున్న తృణకంకణ నాయికా సౌందర్య మెంతయు మనోమోహనము స్వభావ రమ్యము.

శ్రీసుబ్బారావుగారి కావ్య వాతావరణము శుద్ధముగా నాంధ్రమైనది. ఆభావములు అచ్చముగా తెనుగువారివి అందలి నుడికారపు సొంపు తీయని తెనుగుబాసది. తెనుగు దేశము నాజన్మ భూమియని యుప్పొంగు తదితరచయితలు మన భూమివంటి కమ్మని భూమిలేదు, అనియుప్పొంగిన యుత్సాహ శీలురు.

కావునే,

తేనెమాగాణమీ తెలగాణము
తమ్ముడా మాతల్లి యనిపాడరా
సోదరీ మామాత యనిపాడవే

అని శ్రీ సుబ్బారావుగారితో పాటు మనము యేకకంఠముగా ఆవేశముతో చిందులు ద్రొక్కుచుందుము. శ్రీసుబ్బారావుగారి ప్రకృతి వర్ణనలు సహజ సుందరములని వారి కావ్యములలోని ప్రకృతి వర్ణనాఘట్టములే చెప్పక చెప్పుచున్నవి.

సూక్ష్మాతి సూక్ష్మములగు విషయములను గురించి గంభీర తమములగు భావములను ప్రకటించుటలో కవిభూషణునకు గల చాతుర్య మనన్యసామాన్యము. స్వప్నకుమారములోని,

"కారుచీకట్లు లోకము న్గప్పెననుచు
నేలనిందించెనవు మేఘజాలములను"
"పూలబిడ్డల ప్రీతినుయ్యాలలూపు
పవను డెఱుగడు తోడిమలు వదలుననుచు"

అను పద్యములలో ప్రదర్శింపబడిన భావగాంభీర్యము ఆధునికాంధ్ర సాహిత్య బ్రహ్మయగు శ్రీ సుబ్బారావుగారికే చెల్లినది.

తృణకంకణ స్వప్న కుమారములు జతగా పఠింపవలసిన గ్రంథములు. ఈ రెండు కావ్యములు వీరి రచనలలో సగ్రగణ్యములని నా తలంపు.

స్వప్న కుమారమున స్త్రీకాముక భావముతో తన్ను సమీపించిన కవి కుమారునకు పుత్రి భావము నుపదేశించును.

"శుభ శుభాంగి పయోధర కుసుమమందు
మోహ మధువై గవేషించె మున్న సుకవి

శాశ్వత ప్రేమ కోశ శేఫాలమునైన
వత్సలామృత రుచులను వలచె నేడు"

అను రమ్యాలోకము నందలి లక్షణమునకు లక్ష్యము స్వప్న కుమారము. "పిలిచి బ్రతిమాలి పాలీయగలను గాని, బాలుగానుటకు నే యోగ్యురాల గాను" అను వాక్యము స్వప్న కుమారమునకు సంక్షేప రూపము. ఇంత మాత్రమున నాయికయొక్క అభిప్రాయము ప్రేమ కూడదని కాదు; కాని యది ప్రదర్శింపబడవలసిన విధానము వేరు అని మాత్రమే. కావుననే యాదయావతి

"తుమ్మెదలు గ్రుక్కనను చు మధువుం ద్యజించు
భావము విరక్తి కాబోదు పడుచువాడ
కోమల ప్రేమ సంపూర్ణ కుసుమ దశల
నలరు నప్పుడె దుఃఖ రజస్స్ఖలన మగును
వర్ష ధారల గడుగంగ బడిన పాలమె
ఆర్ద్రమైపచ్చబడు నంచు నరయలేదొ"

అని పలికి,

"అనుభవింపుము ప్రేమోచ్ఛిష్టము కుమార
అంటులేదని నీయాప్తు లంపినారు."

అని ప్రబోధించు దృశ్యము కడు రమణీయము.

ఇంక నక్షర లక్షలొనరించు నాధునిక కావ్యము తృణ కంకణము. తృణకంకణ నాయికా నాయకులు ప్రేమ తప స్వినులు; చిన్ననాటి నెచ్చెలులు.

ఈ నాడు మన సంఘ జీవితమున అటనట యరాజకము ప్రబలుచున్నది. విద్యార్థులు కొందరు ప్రేమకు శారీరక సౌఖ్యమని యర్థము చెప్పుచున్నారు. ఒకరి నొకరు వీక్షించి నంత మాత్రమున హృదయము లుద్రిక్తములగుచున్నవి. క్రొత్తదన మొకింత మాసిన యంతనే వైవాహిక జీవితము దుర్భరమగుచున్నది. కొందరి రచనలు యీ మార్గము నే యనుసరించుచు విపరీత సిద్ధాంతములు ప్రతిపాదించుచున్నవి. వీనికి సుబ్బారావుగారు 'తృణ కంకణమున' దివ్య సందేశ మొసంగి యున్నారు.

'తెనుగుతోట'లో నిత్య వర్చస్వినియగు వీరి లేఖిని స్వచ్ఛందగగన తోరణము లకింద, సహృదయానంద కల్యాణ విహృతికొఱకు, లలిత సారస్వత నికుంజవలయమున తెనుగు మీరిన గరువపు తీరులతో భావ పదము బాడినది. ఆ సమయమున తెనుగు తల్లి సముక్షమున భవిష్య దాంధ్ర శోభను అవలోకించినారు కవి భూషణులు.

విమర్శనాశక్తి, కావ్యరచనాశక్తి రెండును ఒకే వ్యక్తి యందు సమముగా విజృంభించుట యరుదు. శ్రీ సుబ్బారావుగారి యందు నిర్మాణ విమర్శనాశక్తులు రెండును సమముగా విజృంభించిన వనుటకు వారి కావ్యములు, 'రమ్యాలోకము'ను తార్కాణములు. కవితా ప్రపంచమున ఆవేశమునక

ప్రస్థాన మొనరించి, ఆనంద సౌందర్యముల నారాధించి ప్రకృత్యుపాసకులై శృంగార రసమును వింతరీతుల బ్రదర్శించి, ప్రేమ స్వరూపిణి యగు స్త్రీని మాతృపీఠమున దాసీనురాలిని గావించి శబ్దార్థములందు సమానముగా తెనుగు దనము ప్రకటించి రసోపాసకులై వర్థిల్లుచున్న ఆచార్య సుబ్బారావుగారే యాంధ్రభావ కవితా సామ్రాజ్యమునకు నిర్మకుట సార్వభౌము లనుట నిస్సంశయము.

నవ్య సారస్వతోద్యాన వనమున కవితారసాల శాఖారూఢయై యెన్నడో ఒకనాటి వసంత కాలమున నెల్లూరి ప్రాంతములో "దువ్వూరికవికోకిలము" శ్రావ్యముగగూసి రసికాంధ్ర ప్రీతి గావించినది. కాని 'భారతి'లో నొకటి రెండు మారులు డప్పయా కలకంఠ వధూకల కాకలీ ధ్వనులు వినరాక పోవుట విచారకరము. అయినను నవ్యాంధ్ర కవుల రచనల నవలోకించి నపుడీ రెడ్డికవీశ్వరుని రచనలు బహుళములనియే చెప్పవచ్చును. ఏలయన, ఫారసి కన్న శ్రావ్యమై పల్లవ కోమలంబగు తెనుగున "పానశాలా" ప్రతిష్ఠలు గావించినాడు. "నలజారమ్మ అగ్నిప్రవేశము"చే మన హృదయముల గరిగించినాడు. "వనకుమారి"యందలి మాహాత్మ్యముచే మన మనముల నాకర్షించినాడు. "జలదాంగన"యందు భావనా మహిమను ప్రకటించినాడు. "నక్షత్రమాల"యందు ఖండకావ్య తారాగణము దివ్య దీప్తులతో ప్రకాశించుచున్నది. ఇక "నైవే

ద్యము" న ప్రొద్దుపొడుపున దేవి పాదపూజకొరకు దోసిటగన్నేరు బూలతో దెచ్చి అర్పించిన హృదయపు సుగంధ దీపము జ్వలించుచున్నది.

సంస్కృతాంధ్రాంగ్లపారసీక వాఙ్మయములతో చక్కని పరిచయముగల యీతనికలము నవనవానంద భావసుందర లతాంతములతో నవ నవలాడుచుండును. క్రొత్త పాతల కూర్మి కలయిక యే యీతని కావ్యములకువన్నె పెట్టుచున్నది. ఈతని కవిత్వమున రాయప్రోలు సుబ్బారావుగారి రచనల యందువలె యుత్సాహ మెల్లెడల దీపించుచుండును. విశ్వసౌందర్యము సర్వమానవ సమానత్వము నీకవి వర్యుడు కాంక్షించును.

రెడ్డిగారు వీరకుల ప్రభూతులు. వీరిభావములు శూరజనోచితములు. కతులకూపము గాంచినంతనే వీరిచిత్తమున రోషాగ్ని ప్రజ్వరిల్లును.

కొండవీటియందు రెడ్డివీరులనెత్తురు శౌర్య సౌరభ్యముల వెదజల్లుటం గాంచి పరవశులైనారు. నాటిరెడ్డి రాజుల శౌర్యము వారికి జ్ఞప్తికివచ్చినది. ఒక్కమారు వారినందరిని స్మరించినారు. ఇకనేమి, యావేశ పూరితులయి శౌర్యలక్ష్మి సాహిత్యరక్తి ఉదారాశయము "హాలోపధామాగ్ని

స్మృతంబగు నగ్నిహోత్రిములుల, మనకడపటి నెత్తురుబొట్టు వరకు చావలేదు, చావలేదు'' అని పిరాలాపములాడినారు.

గాంధీమహాత్ముని రాట్నమే మనకుస్వరాజ్యముదెచ్చునని వచించెను. అందలి సత్యమును గ్రహించినాడు రామిరెడ్డి. ఈ కవియువకుడు దేశచక్రము త్రిప్పెను. విజయకేతనము విప్పెను. ఈయన 'స్వాతంత్ర్య రథము' ననిజప్రభావ దుర్వార పవిత్రమూర్తి యగుస్వాతంత్ర్య దేవతను సాక్షాత్కరింపజేసినాడు. ఆదేవి "ధర్మజీవనాశ్రమే శాంతి బింబమే అకల్మష సత్య నికేతనంబే సంసారఫల స్వరూపమే ప్రజాహృదయంబోయన కనులపండువు సేయుచు, 'సభ్యతా మిషమునన్ దేశంబులందెల్ల నింతకు ధర్మంబులుగాగ నెన్నబడు నన్యాయంబులీ నాటితో వికలంబై చనుగాక యంచు కరుణావేశంబు దీపింప' పలికినది.

రెడ్డిగారి హృదయము మిక్కిలి సుకుమారము, సుమకోమలము. అతి సున్నితము. పూలుకోయుటయె యీ కళోపాసకునకు కష్టము. ఏలయన పువ్వులనుండి ఘుంచుబొట్లు కాల్వలంగట్టెడు నశ్రుబిందువులట్లు గారుచుండును. ఇది సహింపలేక ప్రకృతిచిత్తము నెత్తురులొలుక జేయనే నెన్నడు బూనలేననుకొన్నాడు. నిజమే; పూచిన్నల హత్యజేయు తల పెట్టుట కోకిలకు దూరముకదా! ప్రకృతి రామణీయకమును

పాడుజేసి దైవపూజకు దిగుట పాపముకాదా! ఆవేదవేద్యుని బూజింప నాత్మకుసుమ సమర్పణమే యుత్తమము.

ఈ కళోపాసకునకు ప్రపంచమందలి ప్రతి వస్తువును రమణీయ ప్రతిపాదకమే! ఈయనగరికనుజూచి సంతోషముతో నుప్పొంగుటయే యిందుకు నిదర్శనము. మొన్నగా గురిసిన ముత్యాల వానకు మురిపాలగుబ్బురై పెరుగుచున్న గరికను గాంచి ముగ్ధుడై దైవ సృష్టిని దానికి తావొండు గలదని గ్రహించుకొనుచున్నాడు.

రామిరెడ్డి స్వాతంత్ర్యకాామి. కృత్రిమ బాధముల పాటించుట ఆయన ప్రకృతికి విరుద్ధము. "కాలమనంతము. ఇలవిశాల, భావలోకము క్రమముగా బరయు మార్పు"యని భవభూతి వలె తనమనస్సును స్వాతంత్ర్య సీమనుజరింప జేసినాడు. ఇదియొక్క భావలోకమునందే కాదు. దైనిక జీవితమునందు కూడ స్వాతంత్ర్య మీయనకు ప్రియతమము. కావుననే,

"కూలిజూపి నాకు కూడు పెట్టు
తిరిపమెత్తి తిన్న దీరు నాయాకలి"

అనియొక బీదముసలమ్మచే పలికించినాడు.

రామిరెడ్డి కాపుబిడ్డ. కర్షకుల పైనీతనికి గాఢమగు ప్రీతి. కావుననే కృషీవలుని జీవిత విషయముల గానము జేసినాడు.

ఈయనకృషీవలునికి పల్లెయే సర్వప్రపంచము. అందుపేరియసి యొక్కతయేరమణీయ విగ్రహము. అతనికిగల భాగ్యనిధులు బంగరుపంట పొలములు మాత్రమే ఇక మతమన్ననో అనుదిన పరిశ్రమము. విలంబమనునది యీతని వాఙ్మయమున లేనేలేదు. రాయప్రోలు సుబ్బారావుగారు 'కష్టకమల'యందు బ్రాహ్మణ జీవితము నెంత రమ్యతరముగా చిత్రించినారో దువ్వూరి రామిరెడ్డి 'కృషీవలు'ని యందు కర్షక జీవితమునంత జాగ్రత్తగా స్వీయ కవితా మాలయందు గ్రుచ్చినాడు.

రామిరెడ్డి మనస్సు విశ్వముతో లయాన్వితమై నటించును. ఈతని భావమునందు విశ్వజనానుభూతి యెల్లపుడు విరియుచుండును. ఈతని వాక్యము రసాత్మకము. కబ్బములు రమణీయార్థ ప్రతిపాదకములు. వీరి యలంకారములు వీరి ప్రత్యేక వ్యక్తిత్వమునకుదాహరణములు.

వంగ భాషా ప్రోద్బలము, వైష్ణవ గీతముల భక్తి ప్రపత్తులు, వేంకట పార్వతీశ్వర కవుల రచనలయందు గోచరించును. ఒక భావమునే పలువిధముల జెప్పుట వీరి ప్రత్యేకత. వీరు రచించిన తేట గీతములు, మంజరులలో ప్రత్యేకమగు కోమలత్వముగలదు. తీయని పదములను గూర్చుటలో వీరు ప్రోడలు. వీరి రచనలు

ముఖ్యముగ 'ఏకాంతసేవ,' భక్తిరస భరితమై ప్రకృతి పురుషుల లీలా విలాసమును చక్కగా చిత్రించును. వీరి రచనలు పఠించునపుడు రవీంద్రనాథుని కావ్యకన్యకమన యెదుట నిలుచుండును.

అబ్బూరి రామకృష్ణారావుగారి రచనలు లావణ్యా ప్రధానములు. మాతృదేశభక్తి ప్రబోధకములు. వీనియందు భావనాశక్తి, భవ్యమగు నావేశము సమృద్ధము. వీరి నూతన ఛందోబద్ధములగు రచనలు, నవ్య కవితా లతాంగికి క్రొత్త శోభను చేకూర్చినవి. మందార శిశువువంటి, ఖండ కావ్యములు, వీరి కవితా రమణీయతకు నిదర్శనములు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు స్వైరవిహార ధీరులు; తమ యానందముకొరకే వ్రాయువారిలో నగ్రగణ్యులు.

> "నవ్వవో దురు గాక నాకేటి సిగ్గు
> నా యిచ్ఛయే గాక నాకేటి వెఱపు...
> ...మాయ మయ్యెదను నా మధుర గానమున"

అని చెప్పుకొన్న స్వేచ్ఛా జీవులు వీరు. వీరి పద్యములను, నాయని సుబ్బారావుగారి రచనలను పఠించునప్పుడు దుఃఖించుటయే వీరి స్వభావమనిపించును.

దుఃఖావేశ ప్రపూర్ణములగు షెల్లీ రచనలతో నాయని కృష్ణశాస్త్రిగార్ల ఖండ కావ్యములను పోల్చ

వచ్చును. 'శూన్యమున ఒకడనే పడిపోదును' అని శ్రీ కృష్ణ శాస్త్రిగారు ఆక్రోశించునప్పుడు, "ఏడ్పుగూడ ప్రియంబుగాదేమి పుత్రీ" అను శ్రీ రాయప్రోలువారి వాక్యము జ్ఞప్తికి వచ్చును తన సొగసు చూచి యేడ్చు సుందరివోలె, తమ కవితా ప్రాగల్భ్యమును చూచి దుఃఖించుచున్నట్లు కనిపించుచున్నారు శ్రీ కృష్ణ శాస్త్రిగారు. నాయని, బసవరాజులు లిరిక్ కవిత్వమును తెనుగులో సమగ్రముముగా ప్రతిష్ఠించినారు. ప్రేమయొక్క విప్లవమును తెనుగులో కావ్యగానము జేసి నారు నాయని, కృష్ణశాస్త్రిగార్లు. 'ప్రేయసీ ప్రేయసీ' యను కృష్ణశాస్త్రిగారి గీతములో నేదోయొక విధమగు అనిర్వచ నీయమగు ఆవేదన గోచరించును. వియోగవేదనా భరముచే హృదయము నొప్పినొంద, ప్రియురాలిని గూర్చి తమ యావే దనను ప్రకటించుచు, నొకనిండుకావ్యము వ్రాసికొనిన శ్రీశివ శంకరశాస్త్రి గారి రచన యందలి మాధుర్యము, సౌందర్యరక్తి, భవ్యానురాగము శ్రీకృష్ణ శాస్త్రిగారి యందు గానరాదు, దుస్సహవేదనాభర మొకటిదప్ప. కృష్ణశాస్త్రిగారి యావేద నలో నొకవిధమగు భయంకరత్వము గోచరించును. అగమ్య తమస్వినీ గర్భకుహరాల వెడలిపోయిన వీరి ప్రేయసి, వీరిని నీరంధ్ర భయదాంధకార జీమూతాళిలో, అఘాతంపు టేకాంత ములో విడచిపెట్టినది. శూన్య హృదయముతో కవిగారు,

'ఓచెలీ, ఓచెలీ,' యని కృంగి కృశించినారు. ప్రేయసి కొరకు ఎదురుచూచి వియోగావస్థలో:-

"ఆపలేని నా కోరిక
కారుమాపు బారగచీలి
కాలికమూలు చీకటిలో
క్రాగిక్రాగి నీ కొరకై
కఱవులోనని నశింతునో,"

అనియు,

"ఈ వియోగ నిరాశా
క్షణక్షణ ప్రతీక్ష చెదరి
ఎగసి ఎగసి పగిలిపోదునో,"

అనియు,

"కాలాంతమునకు కాచి యుందునా,
ఆపలేని ఆసకు ప్రాణాంతమేని, వేచియుందునా,
చివురింపదో చైత్ర శుభోత్సవ వసంత
విభా దరిద్ర హేమంతమున,"

అనియు నా క్రోశించినారు. శ్రీకృష్ణుని వేణుగానము విని

"మ్రోయింపకోయి మురళి
మ్రోయింపకోయి కృష్ణ
తీయ తేనియ బరువు
మోయలేదీబ్రతుకు,
మురళిపాటకు రగిలి
మరగునీ వెన్నెలలు.

సొగయు నా యెడ కేల
తగని సౌఖ్యజ్వాల"

"సౌఖ్యజ్వాల"

యను పదము కృష్ణ శాస్త్రిగారి కవితా స్వరూపమునకు తార్కాణము. ఆ చెప్పరాని దుఃఖములో, ఆ యవ్యక్త వేదనలో, కృష్ణ శాస్త్రిగారి కేమియానందమో?

"కుమిలి పోవుదు నాశావ కాశములు"ను అనియు, "ఇది నితాంత తమఃక్రాంత మిది దరిద్ర"మనియు "నిర్జీవశబ్దమిట్టె మూగు, మరల గ్రుడ్డి రాతిరిపడు, మరలనోరుకానిశ్మృతి, లేని చీకటులు మరల మరల పాడిల్లు" అనియు విలపించినారు.

అంతియకాదు, "వెదకి, వేసారి నా వెర్రి బ్రతుకెపుడేని తుదిచేయఁకను మూయునా, బేలనై నిదుర బరువుల కుర్రింగునా"యని జీవితముతో విసుగొంది,

"పనిచేయఁగ లేను, చచ్చిచావఁగ లేను
కనలేని వెలుగు కొరకై ఎన్నడును
కనరాని దాని కొరకై
ఒక క్రొత్త బరవుతో, ఒక క్రొత్త యాసతో
ఒకడనే పడిపోదునూ, శూన్యమున
ఒకడనేకృశియింతునూ,"

అనియు,

"యేడ్పు వైచితి వినువారు యేరు లేక
యేడ్పు సందడి నా లోన నే చొరంగ"

అనియు కృష్ణశాస్త్రిగారు తమ హృదయావేదనను వెలిబుచ్చియున్నారు. కృష్ణశాస్త్రిగారి పల్లకియనుగీతము. మిక్కిలి యాహ్లాదకరము. అదిచదువు నప్పుడు నాయికతో పాటు మనముకూడ "ప్రణయపల్లకి పల్లకి, చక్రచాప వక్రరేఖ పల్లకి, మధు స్వప్నశాఖ పల్లకి" అనిపలుకుచు పల్లకితో యూరేగుచుంటి మనుకొందుము.

తెనుగు కవులలో ప్రియురాలిని శ్రీ శివశంకర శాస్త్రి, వేదుల సత్యనారాయణ శాస్త్రి గార్లవలె ఆదరించినవారు మిక్కిలి యరుదు. వీరి దృష్టిలో స్త్రీ పవిత్ర ప్రేమమయ దేవత. ఆమెకు సంఘమున మిక్కిలి పూజ్యస్థానము గలదు. ఆంగ్లేయ కవియగు Ottway కూడ నిట్టి భావములనే వెలువరించినాడు. "ఆమె నవనీత హృదయ, నా యంతరంగ శాంతి దేవత... జన్మజన్మ పుణ్యములు పండి ప్రాప్తమయిన కేళ పరిత్యాగ లీల ఆమె పద సన్నిధాన దివ్యస్థలాన భక్తి నమ్రుడనై నిలంబడిన యప్పుడు తలపునకు వచ్చునా పేదతనము నాకు" అని యారాధించిన వేదుల సత్యనారాయణ గారును,

"ఇందిరా నిన్ను నేనిష్టదేవతవోలె భావించుచున్నాను భక్తితో నిరతంబు, నీ మనోహర పాద నీరేజయుగళమ్ము

అర్పింతు ఇందిరా అంతరంగమునందు నీ పావన పద్మాల నిట లమ్మ్మ సోకంగ, వ్రాలిపోక ననుజ్ఞ వాంఛించుచున్నాను" అని పలికిన శివశంకర శాస్త్రిగారును, సోదర కళోపాసకులు. దీర్ఘ రమ్య సంస్కృతాభి రామంబునగు ముత్యాలసరముల కూర్పులో శివశంకర శాస్త్రిగారికి ప్రత్యేక ప్రావీణ్యము కలదు.

పండిత కవులై, కవి పండితులై ప్రకాశించు శ్రీ విశ్వ నాథ సత్యనారాయణగారు ఆంధ్ర సారస్వతా కాశమున దివ్య తార. కవిత్వము వీరిచేతులందలి క్రీడాకందుకము. ఆంధ్రావేశము వీరియందు మూర్తీభవించినది. ఆంధ్ర పూర్వ రాజ్యమ్ములు, ఆనాటి సంస్కృతి, నాగరికత తలంచుకొన్నంతనే వీరి హృద యము చలించును. "ఎన్ని జన్మముల నుండియో కదా నాత నువున ఆంధ్రరక్తము ప్రవహించుట" అని వీరు తత్కారణము నూహింతురు. పారతంత్ర్యా పతితులయ్యును పురా మహా దాంధ్రమున స్వతంత్ర పౌరుడనను భ్రమ వీరికి సత్యముగా దోచుచుండును. అపూర్వములగు భావముల కాలవాలము వీరిహృదయము. చిత్రవిచిత్ర భావసౌదామినులు వీరిహృద యాకాశమున తళ్కొత్తుచుండును. "నేను మాయమ్మయొుడి లోన నింతవాడనైనయప్పుడు నాలోన యఖిల మిమిడియుండె నేమొ" యని తలంచి, "పాడుటకు మున్ను కంఠగర్భమున నెరుగరాక యవ్యక్తమై యున్న రాగమట్లు నిభృత చిక్కణ

మూర్తులు నీవు నిసువుకెన్ని సుఖములు దాగినారెటుల దేవి”
అని ప్రశ్నించుచున్నారు. పరమేశ్వరుడు వీరికెన్ని యాపదలు
గలిగించినను దయాస్వరూపుడే. దయాంబుధియను ఖండకావ్య
మిందుకు నిదర్శనము. ఇంకొకయెడ పరమేశ్వరుడు వీరిని
పరిగాఢశర్వరీచ్ఛవి, దరిద్రతా నిధానము, తేజోవిహీనము,
అనవరతము బాష్పధారా మిళితమునగు అంగణమున ఉండు
మనినాడు. ఎన్నడోయొక్కనాడు మాత్రము ఆ అంధ
కారమున మెరపు మెరసినది. ఆనాడు వారి కుటీరమానంద
వాయుప్రచార శతసహస్ర కుసుమ పరిమళ వ్యాప్తమైనది.
కాని యంతలోతిరిగి చీకటులు క్రమ్మినవి. ఆనాటి మెరపును
స్మరించుకొను చుండినారు కవిగారు. కాని లోకమును
దూషింపలేదు. జీవితము హేయము, దేహము తుచ్ఛము
అని తలంచి దానికి స్వస్తిచెప్ప నుంకింపలేదు. అట్లయినను
పరమేశ్వర హృదయము వారి దృష్టిలో కరుణా సాగరము.
ఒకనాడు వారు ప్రభుదర్శనార్థమై దేవాలయమున కేగుచుండ
త్రోవలో ఎవరో యొకరు ఆయనయే వీరి గృహమునకరిగి
నాడని చెప్పిరి. కాని వారే మార్గమున నేగిరో ఆయన యే
త్రోవ నరుదెంచెనో యొకరి నొకరు కలసికొనరైరి. ఆ పర
మేశ్వరుని దోషమందు లేశమునులేదు. కావుననే వీరు “స్వ
పథాంచల మంటని మాపథమ్ము.........యొంత దురదృష్ట
ముద్రితమ్ము” అని తమ భాగ్య దోషమునే తలంచుకొనిరి,

'ఇరుత్రోవలో. ప్రభువుయొక్క రథము దీక్షాప్రణీత విధుర వేగము తో పర్వులెత్తు చున్నది. అపుడు కవిగారి శరీరము దాని క్రిందబడి నలిగినలిగి రక్త ప్రవాహములింకినది. ఈదీనుడెవరో ఈ హాహా నినాదమునకు కారణమేమో యని యైన రథములాగ లేదు. తిరిగి చూడలేదు. తెల్లవారినచో రథచోదకుడు రక్తాంకితములగు చక్రములను కడగి శుభ్రము చేయును. ఈ సమయమున కవిగారు గాయముచే బాధపడుటలేదు. దేవుని దూరుటలేదు. కానివారికి కలిగినది "అచటి బహుజన రక్తములందు నాదియదని గుర్తేమి కనబడునుస్వామి" అను ప్రశ్న యొక్కటియే. ఆహా! స్వార్థత్యాగమగు దైవభక్తి. అపురూపములగు భావములను, అనురూపములగు పద్యములలో వ్యక్తపరచుటయందు జాణలు శ్రీ విశ్వనాథకవిగారు. ఉన్నత భావాంచిత వీధులందు విహరించు కవిసామ్రాట్టులయ్యు వీరు సామాన్య జనుల భావములను చక్కగా దెలిసి వ్యక్తీకరింప సమర్థులు. ఎన్నియోదినములనుండి నిరీక్షించిన వర్షమునకు వీరేవిధముగా స్వాగత మొసగుచున్నారో చూడుడు, "మా జొన్నలు పూతవట్టెనిక పొంతపొలాలకునీరమబ్బెడిన్; మొన్నటిదాక వానలకు మోములు వాచిరిమాదు కర్షకుల్" మేఘమునుద్దేశించి 'మక్కిబెడ్దడుగు పెట్టగ జాలని మా పొలాలలో నురుమద్వైవ పాదకటకోజ్జ్వలనాద మనోహరంబుగానురిమిన నీకా సంగెదను పాయసముల్ నవబాష్ప బిందువుల్' అను చున్నారు.

ఆవానయొక్క యుపయోగము "పొడి పొడియై తలల్ ముదిరి పోయిన మెరసెనికారుజొన్నలో, పడితిని కొత్తలో పసరుపంటిడిజాగిన యావ్రుదూడలుక్, తడవడి పోయె మాయెడదతల్లడిలెన్ తొలివానచిన్కుపైబడి సుఖమయ్యె నేటికిన పాయతనొందెను మాదుసస్యముల్". "పొలములవట్టి నీరములు బోదలె నిండవు, నాకు మళ్ళలో చెలమల నీరుతోడి యరచేతులు బొబ్బలు వొక్కె, బోదెలోపలి జలమంచు పిచ్చుకలు పాపము ముక్కులుముంచుచుండె నీ విలయముదాటి పోయెనని పించెను నీ మురుముల్ కృపాంబుధీ" అని సవిశేషముగా చిత్రిచినారు. మాగనోము ఆచరింప సమకట్టిన ఆంధ్ర యువతి సొగసునొక మాకుతిలకింపుడు.

"నీ తెలిపట్టు చీరమెఱు నీడలు సాగి
మసుంగు సంజకెం
బూతల తెల్లతేమొగిలు పోలిక
వాలిక గాలి తూలిపో
లేత బెడంగు కుచ్చెళులు నీ చిరు
కాళుల ముద్దుతోచెనో
లేత పొరాముపయ్యెద చలించిన
పచ్చని తాళి దోచెనో"

ఆ కమ్మని పాలబుగ్గ, పతి కోసము ఇన్ని నోములను కిమ్మనకుండ నోచుచుండుట గాంచి కవిగారు "ఓసి పసిదాన

భవన్నియమ పరిభావ సంధానముచేత నీ పతిసుధామయమూర్తి సముజ్వలించెసికా” అని యాశీర్వదించినాడు.

చక్కని భాషలో తీయని భావములను పారిజాత కుసుమ సుకుమారములగు పద్యములలో వెల్లడిజేయు నిపుణులు కొడాలి ఆంజనేయులుగారు. తెనుగు భాషయొక్క చక్కదనమే వీరి కవిత. వ్రాసినది స్వల్పముగాని గుణము ఉత్కృష్టము. వీరి కవితా కన్య నాజూకు రసికుల మనస్సుల నుయ్యాలలూగించును. రాధిక నుద్దేశించిన పద్యములు కడు రమణీయములు. సిగ్గువాలకెడు చూపులతో ఇతరులెవ్వరును చూడనట్లు వేదికపై నాసీనయైన పెండ్లి కూతురు తన ప్రియుని వీక్షించుటను జూచి ఆమె నుద్దేశించి వీరు వచించిన యీ క్రింది వచనములు సహజాపాత రమణీయములు.

“త్వాదృశ బాలికల్ తలుపు దగ్గర
బాటలువాడు పెద్ద ము
త్తైదులు భర్త పేరడిగి నప్పుడు
తీగ రొలుంగు ముగ్ధతన్
వేదవడంగవంతు మన పెండ్లి కు
మారునిదన్న
నీదు లజ్జాదరహాస చంద్రికలు
శాశ్వతమై వెదజల్లు గావుతన్.
పునుగు జవాది తావులు గుబుల్కొను నీ
పసుపుం బయంటకొం

కనుముడివైచి కొంటెగడ కోమలి
నీ మగడింక నెట్లు చె
ప్పినటులే వినంగలడు పెండ్లము గీచిన
గీటుదాటడం
చునువదినల్ నగన్ జురుకు చూపుల
జూచెదు నీకు సౌఖ్యమా"

సలక్షణమగు కవిత్వము వ్రాసి ఆంధ్రరసికలోకము నాకర్షించిన వారు శ్రీ జాషువగారు. వీరిధారాశుద్ధి మిక్కిలి ప్రశంసనీయము. పద్యములొకటి రెండు పర్యాయములు జదివిన కంఠస్థమై భావము చెవులలో ప్రతిధ్వనించుచుండును. వీరు ప్రయోగించు పదములయందొక విధమగు తీయందనము మెత్తందనము అనిర్వచనీయమగు సౌందర్యము కలవు. ఇందుకువీరు రచించిన ఖండకావ్యములు, ముఖ్యముగా 'ఫిరదౌసి' 'గబ్బిలము' లేసాక్షి. 'ఫిరదౌసి'లో ఈకవికోకిల, కవుల శక్తి సామర్థ్యములను గుఱించి యేమని వచింపుచున్నాడో గమనించుడు.

"కవిని గన్నతల్లి గర్భంబు ధన్యంబు"

... ... ... ...

"దాటిపోయిన యుగముల నాటిచరిత
మరలబుట్టింప గవియె సమర్థుగును..."

... ... ... ...

"కవిశాశ్వతుడుగ్వరసా

ఽనితారము గావహించు...”

.... ... .... ....

“వసు శాసింప గలసార్వభౌముడగును
ధీరుడగు భిక్షుకుండగు దీనుడగును
దుఃఖితుండగు నిత్యసంతోషియగును
సత్కవి ధరింపరాని వేషములు గలవె?”

.... ... .... ....

“తమ్మిచూలి కేలుదమ్మినిగలనేర్పు
కవికలంబునందు గలదుగాన
నీశ్వరత్వమతనికే చలామణియయ్యె”.

ఇవి యితనికి సత్కవిని గురించియున్న మహోన్నత భావములు. ఇక ‘ఫిరదౌసి’ లోని కవిత్వమును గురించి ముచ్చటింపవలయునన్న, ఫిరదౌసీ యొక్క కవిత్వమును గురించి కవిగారు వచించిన మాటలనే పునరుద్ఘాటింపవలెను. ‘సొంపుతడి యూరని’ ఈ కావ్యములో “పదములపొందిక గుఱ్ఱపు కదనునకైన వచ్చు”ను. “రససంపదయు స్వభావ శబలతయు” గల ఈ హృద్య రచనలోని శయ్యావిలాసము “దిరిసెనపుంబూవుకరణి ముద్దులుగారు”ను ఇక్కవి వర్యులొక చోట “మల్లెపూవుటత్తరు లొలకించి” వేరొకచోట “విషాదగీతములకే మిగిలిన రసహీనమైన మషీపంకము”తో “సుఖంబుల ప్రొద్దుగుంక” జేసి “భయంకర ఖేదతమాలవాటిక”లో తాండవింతురు. కవికోకిల, కవితా విశారద, బిరుదాంకితులైన జాషువాగారి కృతులన్నింటిలో కరుణరసప్లావితమైన ‘ఫిరదౌసి’ మేలుబంతియని నాతలంపు.

అపారమైన దేశభక్తి, అఖండమైన స్వభాషానురక్తి అప్రతిహతమైన జాత్యభిమానము వీరి ఖండ కావ్యములందెల్ల మెండుగ గానుపించినవి. వీరి "గబ్బిలము"లోని, "తెలుగురాజ్యంపు వెలింప శ్రీలకొకానొకప్పుడు కేళీరంగ"మైన హంపీక్షేత్ర వర్ణనను జదివి కన్నీరు విడువని తెలుగువాడుండడు. ఒక తెలుగు వాడే కాదు; "ఉజ్వల శిల్ప మఖండ తుంగభద్రానది కప్పగించు కొని దగ్ధమైన తెలుంగువారి విద్యానగరా"న్ని జూచి యేడ్వని వాడెవడుండును?

> "మూరురాయరగండ హోరంగడీనాడు
> విద్యానగర రాజవీధులందు..."

అనివాపోవుచు,

> "మణిమయంబైన యాంధ్రసామ్రాజ్య రథము
> భువినిగుర్తింగిన పదియునారవ శతాబ్ది
> కృష్ణవిభువీట బోర్ద్రుక్కినది మొదలు
> బుద్ధిభాగాంగన! తెల్లవారనది లేదు..."

అవి తెలుగువారికడుపు చెరువౌనట్లు సహజముగా విలపించిన యీకవిగారి ఆంధ్రాభిమానమెంత మహోన్నతమో యెంత పవిత్రమో గదా!

దుష్ప్రాప్తిరు, మొదలగువారివలెనే జాషువా గారికిని, సత్యముఅహింస రాట్నము అభిమాన వస్తువులే యైనను అన్నివిధముల నధోగతికి పాల్పడిన హరిజనులపై వీరికి ప్రత్యేకమైన ప్రేమ. వర్ణవ్యత్యాసములవలన అగ్రజన్ములనబడువారు వీరిపై విధియించిన ఘోరయన్యాయములను నిర్మొహమాటముగా, నవకాశమున్నప్పుడెల్ల యధిక్షేపించినారు. వీరిని, "మా

దేశలమని యెవరైన ప్రశ్నించినచో 'బాతునుగురించిన్నట్లగును.' పతితమానవులకు, "పరుల దుర్గతి గని గుండె గరగి వగచు, సదయ హృదయుల వీక్షణాంచలమునందు బుట్టుచుండుసుకన్నీటి బొట్టువోలె, ఏడి భగవంతుడని సంశయింతువేల?" అను వాక్యములచే నూరట గలిగింపజూచినారు. జాషువాగారి యితర కావ్యములు 'స్వప్నకథ,' 'ముంటాజమహాలు,' 'కాందిశీకుడు'

తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారి పద్యములు, ముఖ్యముగా సీసములు, శ్రీనాథుని రచనా గాంభీర్యమును జ్ఞప్తికి దెచ్చును. తెనుగు నుడికారపు సొంపు వీరి శబ్దములందు పూర్ణముగా గన్పట్టుచున్నది. "నాకులమ్ము నందువలె కవితలోగూడ కమ్మదనము వెలయింతు న"ని వీరన్నది యథార్థము. తిక్కనార్యుని దలపించు వీరి 'యాత్మకథ' నిక్కముగా భారత ప్రతిబింబమే.

మాధవపెద్ది బుచ్చి సుందరరామ శాస్త్రిగారు 'ఉమర్ ఖయాం,' 'బృందావనము' 'పంచవటి' మొదలగు చక్కని ఖండ కావ్యములను సంతరించిరి.

ఇట్లొకవంక ననేకులచే మన భాషలో శృంగారకరుణ రస ప్రధానములైన ఖండ కావ్యములు ప్రవర్ధమానమగు చుండె యీనాడు మనకు మిక్కిలి యావసరమై జాతిని వీర్యవంతముగా చేయజాలు వీరరస ప్రధానములగు కావ్యములు కొన్ని యుద్భ

వించినవి. ఈ రచయితలెల్లరను పండిత కవులగుట పేర్కొన దగిన విశేషము.

ఈ కావ్యములలో సుప్రసిద్ధములగు రెండు, ప్రొద్దుటూరుగ్రామమను ఉద్యాన వనమున మొగ్గ దొడిగినవి. అవియే శ్రీ పండిత రాజశేఖర అవధానిగారి "రాణా ప్రతాప సింహ చరిత్ర" శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రిగారి "శివ భారతము" అను ఉత్కృష్టములగు కావ్యరత్నములు. ఈ రెండు కావ్యములును ప్రబంధ పాకములోబడి ను, విషయ ప్రాముఖ్యము వలనను, ఖండకావ్య యుగమున నుద్భవించినందునను యిచ్చట ముచ్చటింపనైనవి. ఆంధ్రభారతముతో సమానముగా భాషా సేవకులు ఆదరించి ఆరాధింప తగినవీ రెండు మహా కావ్యములనుటకన్న నీ కావ్యము లందలి శిల్పమును ప్రత్యేకముగా వర్ణించుట యసాధ్యము.

వీరివలెనే ఉదాత్త కావ్య నిర్మాణము గావించి ప్రచారము నొల్లక కొంతవరకు అజ్ఞాతముగా నున్నవారు కవిరత్న శ్రీ అంబటి పూడి వేంకట రత్నముగారు. ఈయన నివురుగప్పిన నిప్పు. ఈయన కావ్యములలో నగ్రగణ్యములగు 'మైనాదేవి,' 'మొరాకో కన్య' పైన పేర్కొనిన గ్రంథములతో పాటు మన వీర కావ్య సౌధములో నగ్రస్థాన మాక్రమించుకొనును. శ్రీ వేంకటరత్నముగారు కవియేకాదు. ఒక సంస్థ. చందమూరు

ప్రాంతమున 'సాహితీ మేఖల'ను స్థాపించి నేడు తెలంగాణము లోని యువక కవులలో పేరువడసిన శ్రీ ధవళా శ్రీనివాసరావు, పులిజాల హనుమంతరావు, సిరి ప్రగడ భార్గవరావు, మద్దోజ సత్యనారాయణగార్ల వంటి కవి కిశోరములకు భావనా గురువులై వారిచే రసవంతములగు కృతుల రచింప జేసిన కవివర్యులు శ్రీ అంబటిపూడి వారు.

ఇట్లీ భావకవితా సారస్వతము నొకమారు తిలకించితిమేని వానిలో ముఖ్యములు ఖండకావ్యములని తెలియుచున్నది. మహా కావ్యరచనను ప్రోత్సహించు మహారాజులు లేకపోవుటయు అనేక విషమ సమస్యల జాలవాలమగు నీకాలమున ప్రజలకు దీర్ఘకావ్యములు పఠింప నుత్సాహము లేకుండుటయు ఆంగ్ల భావ కవి కుమారుల రచనలు ఎక్కువగా ఖండ కావ్యములే యగుటయు కొంత వరకు సమర్థులగు కవులకు విశేషముగా నవకాశము లేకుండుటయు నిందులకు కారణములని తోచును.

పాశ్చాత్యులలిరిక్ కవిత్వము,జాతీయోద్యమముల ప్రభావ పరిణామముగా ప్రభవించిన భావకవితా స్రవంతి ఖండకావ్యములు, గేయములను రెండు పాయలుగ ప్రవహించినది. ఖండ కావ్యములతో బాటు తెనుగు బాసలో గేయములుగూడ ప్రజామోదము వడసి అనేక ఉత్తమ రచనలకు దోహద మొసంగినది. అంతమాత్రమున మన వాఙ్మయమున నింతకు మొదలు గేయ కవిత్వము లేదని కాదు. జానపద గీతములు, పల్లెపా

టలు, స్త్రీల పాటలు, మేలుకొలుపులు మొదలుగాగలవెన్నియో ప్రజలలో విరివిగా ప్రచారమున నుండినవి. త్యాగయ్య క్షేత్రయ్యవంటి గేయకవులు ఆంధ్రుల కీర్తిని దశ దిశల నెల కొలిపినారు.

ఆధునిక సాహిత్యమున శ్రీ గురజాడ అప్పారావుగారి 'ముత్యాల సరములు' నంపూరి సుబ్బారావుగారి 'యెంకి' కంఠ మునలంకరించుటతో మొట్టమొదట, గేయ సాహితీ కన్యకు క్రొత్త చైతన్యము నూతనోత్సాహము కలిగి, ఒక రమణీయ స్వరూప మేర్పడినదని చెప్పనొప్పును. తరువాత యీ గేయ సుందరిని నవ్యాంధ్ర సాహిత్యారామములోని సుందర మందిర ములో జేర్చి సర్వాంగ శోభితగా తీర్చి దిద్దినవారిలో ప్రము ఖులు శ్రీ బసవరాజు అప్పారావు, విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు, నాళము కృష్ణారావు, మల్లవరపు విశ్వేశ్వర రావు ప్రభృతులు.

తెనుగు భాషయొక్క తీయందనమును సౌందర్యమును వ్యక్తపరుపకలయున్న జటిలపద సమాసములను, కృతక గ్రాంథిక భాషను పరిత్యజించుటయే కాక ఈ భాషకు వృత్త ములనాను కూలములనియు సరళమైన మాత్రాఛందస్సులే యుక్తమనియు అభిప్రాయ పడిన గురజాడ అప్పారావుగారు గేయ కవిత్వమునకు మార్గదర్శి; ఆ కవి,

" వెనుకచూసిన కార్యమేమోయ్
మంచిగతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుకబడితే వెనుకెనోయ్

... ... ... ...

దేశాభిమానం నాకు కద్దని
వట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూనియేదైనాను ఒక మేల్
కూర్చిజనులకు చూపవోయ్

.... ... .... ....

స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్

.... ... .... ....

ఈ సురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్ ? "

అని సోదరాంధ్రులనేకాక భారతీయులందరిని సూటిగా ప్రబోధించినారు. 'దేశమును ప్రేమించుమన్నా' అను ఈ గేయము, రవీంద్రుని, బంకించంద్రుని, ఇక్బాలుని జాతీయ గీతముల మరపించుచున్నది. ఈ గీతముతో అప్పారావుగారి పేరు ఆంధ్రులలో చిరస్థాయిగా నుండగలదు.

నండూరి సుబ్బారావుగారి పాటలు మహోన్నత భావ పరిపూర్ణములై సహృదయ హృదయాహ్లాదకరములై యొప్పు చుండును. చూపుతో మాటాడి ఊపిరితో తెనిగించు శ

వీరికిగలదు కవిత్వము వీరిని వలచివరించినది. ఈ మార్గమున నింకెందరో ప్రయత్నించినను 'ఎంకిపాటల'వంటి మనోహర కావ్యము మరియొకటి వెలువడలేదు ఎవరేమన్నను 'ఎంకిపాటలు' ఆధునికాంధ్ర వాఙ్మయమున కమూల్యాలంకారమనుట నిస్సంశయము.

బసవరాజు అప్పారావుగారి పాటలు మనోహరములు. 'యశోధరా విలాసము', 'కొల్లాయిగట్టితే నేమి' మున్నగు గేయములు ఆంధ్రవాఙ్మయమున శాశ్వతముగా నుండదగినవి. వీరిరచనలు ముఖ్యముగా స్వానుభవ భావ్యములు. ఉద్వేగావేశయుక్తమగు సూటియగు భావప్రకటన వానియందు వ్యక్తమగుచుండును.

విశ్వనాథ సత్యనారాయణగారి 'కిన్నెర సానిపాటలు', 'కోకిలమ్మ పెండ్లి' నిజముగా సార్థకనామములు. 'కిన్నెర సానిపాటలు' అనినంతనే, కిన్నెర మధుర సంగీతశ్రుతులు చెవులలో ప్రతిధ్వనించును; నరసాళియైన దొరసాని స్వైరవిహార సంపన్నత, మనోజరాగిణియైన భోగిని రూపరేఖా విలాస విభ్రమములు, కనులకు గన్పట్టును. 'కిన్నెరసాని'లోని శబ్ద చిత్రము, శైలి, భావగాంభీర్యము అనితర సాధ్యములు. కిన్నెరసాని యను పేరుగలిగి యున్నంతమాత్రమున నొక రస వత్కావ్యమును నొక మహాకవిచే వ్రాయించుకొని తన ఆస్తిక్యమునకు శాశ్వతత్వము గడియించుకొనిన ఆసెలయేటి కన్నియ యెంత ధన్యయో కదా!

బొడ్డు బాపిరాజుగారి 'కాత్యాయిని'. అడవి బాపిరాజు గారి 'గోధూళి', నాళము కృష్ణారావుగారి 'తేనెచినుకులు', మల్లవరపు వారి 'మధుకీల' యిట ప్రత్యేక స్మరణీయములు.

మన దేశమునందలి రాజకీయోద్యమ ప్రచారమునకు యీ గేయము చక్కగా అనుకూలించినది. గాంధిమహాత్ముని పిలుపు వినినంతనే ఒక్క మారు ఆంధ్రదేశమంతయు సత్యాగ్రహ సమరమున ముందంజవేసినది. కవికుమారులు సోదరాంధ్రులను ప్రబోధించి యీ తెల్ల దొరతనమునకు స్వస్తి చెప్పవలెనని ఆదేశించినారు. వారికి గేయము అనుకూలమగు సాధనముగా ఉపయోగించినది. ఆ రోజులలో శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు కృష్ణాపత్రికలయందు పుంఖానుపుంఖముగా రాజకీయోద్యమ ప్రచారకమగు గేయములను ప్రకటించినారు. భరతమాత నుద్దేశించి వ్రాసిన గేయములు శ్రీ సత్యనారాయణగారికి ఆంధ్ర సారస్వతమున నొక విలక్షణమగు స్థానము నొసగుచున్నవి. ఇది ప్రజా యుగము; స్వాతంత్ర్యము ప్రజల జన్మహక్కు. నిరంకుశమగు ప్రభుత్వమును, బూజు పట్టిన రాజరికమును ప్రజలు సహింపజాలరు. ఇట్టి భావములు మన గేయకవుల రచనలను ప్రేరేపించినవి. శ్రీ పురిపండ అప్పల స్వామిగారు "రాజుగారి కోటలో, రాణిగారి తోటలో జిల్లేడు మొలిచింది, పల్లేరు ప్రాకింది." అని మొలి గెత్తి చాటుచు విప్లవ పతాకమును ప్రతిష్ఠించినారు. శ్రీ మాదపపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రి అంటరాని తనమును నిరసించుచు గేయరచన గావించినారు.

ఈ విధముగా ప్రబంధ కవులవలె భావ కవులుకూడా తెనుగు సాహిత్యములో నొక ప్రత్యేక వాతావరణము సృష్టించినారు. దేశభక్తి ప్రబోధకములగు పద్యములను వారు గానముచేసినారు. ప్రియురాలు వారికారాధ్యదేవత. వారు స్వేచ్ఛాజీవులు; సౌందర్యమును ఆనందమును ఉపాసించువారు. అరసికులకు రసము నివేదించుట సాధ్యము కాదని వారభిప్రాయ పడినారు. కావుననే,

"సుకవి భోగ్యంబు లిచటి వస్తువులు వీని
నలిపివేయకుడిటు నటు కలచి నైచి"

అని వారు హెచ్చరించినారు. తుషారజలము, నీలంపు జలదంపు నిగ్గు, విరిచేడీ చిన్నారిసిగ్గు, వసంత ఋతుశోభ కోయిల కూతలు, కమ్మతెమ్మెరలు, ఎలదేటి చిరుపాటలు, చిఱుజరీయంచు చీర, రుచిరకర సరోజములు, కాంచనహార విలసత్కంఠదేశము, జారుచెమ్మట ముత్యాల జంపుసరులు మున్నగు మనోహర సామగ్రినివారు సాహిత్యమునందు సమకూర్చినారు. కాని వారు కల్పించిన యీనిత్యకల్యాణము పచ్చతోరణము యెక్కువ రోజులు కాపురము చేయలేదు. ఆ సుఖస్వప్నములు కొలదికాలమే నిలిచియుండినవి.

౪

# అతి వాస్తవికత: అభ్యుదయ యుగము.

ప్రథమ ప్రపంచ మహాయుద్ధానంతరము ప్రజాస్వామికముల బూటక పరివర్తనపైనను, యుద్ధకారణ మగుపెట్టుబడి విధానముపైనను, శుష్క-ధర్మ ప్రవచనముల పైనను ప్రజలకు యేవగింపు, నిరాశ, నిస్పృహా కలిగినది. తత్ఫలితముగా పాతసాంప్రదాయముల నెదిరించి క్రొత్తవానిని యేర్పరుచుకొను ప్రయత్నము తీవ్రరూపముదాల్చినది. ఇతరరంగము లందువలె సాహిత్యరంగమునగూడ యీప్రయత్నము ప్రస్ఫుటమైనది. కవిత్వములో తిరుగుబాటు, పురోభాగిత్వము పొడసూపసాగినవి. పూర్వ ఛందోనియమములను కావ్యసాంప్రదాయములను పాటించక యెవరి యిష్టము వచ్చినట్టు వారు వ్రాయసాగినారు. ఈ క్రొత్త క్రొత్త పోకడలకు, Dadaism, Sur-Realism, Impressionism అనుకొన్ని పేర్లు వ్యాప్తిలోనికి వచ్చినవి. ఈ'యిజం'లలోనే యొకదానికిగూడ సరియైనస్వరూపము యేర్పడకమునుపే మరియొక్క 'యిజం' బయలుదేరి సాహిత్య రంగమునఅరాజకత్వము, అయోమయత్వము ఆవరించినవి.

పైనపేర్కొనినట్లు భావకవుల సుఖస్వప్నములను పడద్రోసి వారుకల్పించిన ప్రశాంత సుందర వాతావరణమున

అరాజకత్వపు సుడిగాలి తీవ్రముగా చెలరేగినది. ఇన్నాళ్ళనే యూరచన సాగించుచున్న కొందరు కవులకు యీ అధివాస్తవికతపై ప్రీతి హెచ్చినది.

పల్లె పడుచు, నిర్మల మనస్కురాలు నగు 'యెంకి' యింటి నుండి బయలు దేరి 'కిన్నెరసాని' యింట నుపాసనము ముగించుకొని 'గోధూళి' వేళ నవ్య సాహిత్యవీధులందు మలయమారుతము సేవించుచున్న కవితాలతాంగి ఒక్కమారుగా యీ అరాజకత్వపు కారుచీకటులను యెదుర్కొన వలసివచ్చినది. ఒక వంకనుండి శ్రీశ్రీ గారు మరియొక వంకనుండి పఠాభిగారు అట్టహాసముగావించుచు ఆమెకు చీకాకు కలిగించిరి. ఆయమ తొట్రుపాటును, మంజులగళస్వనమును, కజ్జలాన్విత నేత్రయుగ్మమును అవలోకించి శ్రీశ్రీ గారు

"యిదేమిటీవింత భయాలు?
ఇంట్లో చీకటి!
ఇదేమిటీ అపస్వరాలు?
తెగిందితీగ!
అదేమిటారంగులనీడలు?
చాప్రాబ్రతుకూ!
ఎక్కడికెళ్తావీరాత్రి?"
అనిగద్దించి అడిగినారు.

"దుడ్డుకఱ్ఱతో నడుములు విరగదంతాను" అని పఠాభి గారు,

'భళీభళీ మాతాత బల్లెంబుచేబూని
పుల్లాకు తూటుగా బొడిచినాడు'

అను పద్యమును శాస్త్రికి దెచ్చుచు వికటాట్టహాసముగా వించినారు,

"ఎబ్జ్రశాలున కప్పుకొనిమాయింటికొచ్చిందొకరివాల్యర్" అని భయ పెట్టినారు. ఇక పాపమామె భరించుకోలేక పోయినది.

"తురాయికంటె, ఆకురాయికంటె,కీ
చురాయి కంటె హిమాంశురాయిగొప్పవాడ"ని

"తెల్లమబ్బులు, తెనాలివెళ్ళాను, కుక్క వెంటపాండవులు స్వర్గానికి" అనుపదగృత్యములు భావకవితాకన్యనుభయాన్వితను గావించినవి.

శ్రీ శ్రీ, పఠాభిగార్లతో పాటు అధివాస్తవికరచనలు సాగించినారు గోరాశాస్త్రి, శ్రీరంగం నారాయణబాబు, సారీస్, ఆరుద్ర, దేశరాజు కృష్ణశర్మ మున్నగువారు. [అదృష్టవశాత్తువీరు కొలదిగానేయున్నారు.]

ఈ అధివాస్తవికతాస్వరూపమును నిర్దేశించుట సాధ్యముగానిపని. అట్లు సాధ్యము గాకపోవుటయే అధివాస్తవికత యొక్క ప్రత్యేకతయని చెప్పవచ్చును. కావుననేవారు,

"జీబ్రాకు, Algebra చిహ్నాల
లాంకోటు సాంకోళ్లుతొడగి
సాహిత్యం పౌరోహిత్యం చేస్తే
నెత్తికాదు Sur-realism రా, సోదరా!"

అని చెప్పియున్నారు.

వీరిరచనలను పరిశీలించినప్పుడు యెవరికివారే యమునాతీరే అనుసామెత జ్ఞప్తికివచ్చును. ఒకనిర్ణీతమగు ఆదర్శము లేదు. ఒక విస్పష్టమగు పద్ధతి కానరాదు. ఏదోయొకవిధముగు గడబిడగావించుటయే వీరుసాధింపదలచు పరమప్రయోజనము. గందరగోళముచేయుటకు వీరికిసాహిత్యమొక సాధనము. సౌందర్యమునకు అగ్ని సంస్కారము గావించుటయందే వీరికానందముకలదు వీరు ఉపయోగించుపదములకు అర్థము లేదు; ఉండవలసిన యవసరములేదు. అర్థమును అధ్వాన్నపు అడవిలో వదలుచున్నారు యీమతమును తెనుగులో ప్రతిష్ఠించిన పీఠాధిపతులు. ఛందస్సువీరుఅర్థమునకుముందే పరిత్యజించినారు. "లీలగుడి మ్రింగువానికి లింగమెంత?" అనిగదా ఆర్యోక్తి. పిల్లినలె మ్యావు మ్యావు అని యరచుటయందు వీరికేమో ఆనందముకలదట. అదియెట్టిదో కేవలము అరచ యితలకే అనుభవైకవేద్యమేమో! ఆట్లరచుచు గూర్చుండక సారస్వతముపైన దాడిగావించుట యెందులకో తెలియదు. ఇంగ్లీషుమాటలు, ఇంగ్లీషులిపిలో వీరు పుంఖాను పుంఖము

వాడుచుందురు. తెనుగు లిపి క్రమమును [Spelling] స్వతంత్రి సము చేయుట వీరి మరియొక ప్రత్యేకత. ఈ సందర్భమున వీరాభిని అసహాయశూరునిగా మనము పేర్కొనవచ్చును. ఒక్క మాటలో, నోటికివచ్చినది, ఇష్టమువచ్చిన రీతిని వ్రాయుటయే వీరివిశిష్టత.

సాహితీ సమితి కవులమీద పగతీర్చుకొనుటమే వీరి ముఖ్యోద్దేశమైనట్లు వీరికవితా సామగ్రివలన మనకు విస్పష్టమగుచున్నది. చూడుము,

“ప్రేలిచంపిన వేడినెత్తురు, క్షుద్రాలిక నయన జ్వాలి కలకత్తా కాళికనాలుక, రగులుకొన్నే రాక్షసిబొగ్గు, బుసలుకొనే బుస్కాగుండా, తాబందుల రెక్కలచప్పుడు” వీరికవితా సామగ్రి. భీభత్సము, Uglyism వీరికవితా ప్రపంచమున వికటాట్టహాసముగావించుచుండును. ఇది సాహిత్య రంగమున అరాచకత్వము [Anarchy].

బహుభాషా పారంగతులై ఆధునిక విజ్ఞానము చక్కగా అవగాహనముజేసికొనిన వీరయిట్టివిధ్వంస పూరితములగు వ్రాతలలో కాలక్షేపము చేయుటకన్న ఆంధ్రవాఙ్మయమును విజ్ఞానవంతము చేయుటకు శ్రమజేసిన బాగుండును. లేకపోయిన వీరిమేధాసంపద, విజ్ఞానము అడవిగాచిన వెన్నెలయే.

ఒక్కమాటలో, యీ అధివాస్తవిక వాదులకొక ఆదర్శములేదు; భవిష్యత్తు లేదు.

1930వ సంవత్సర ప్రాంతమున సకల ప్రపంచము ఆర్థిక క్షోభకు ఆలవాలమైనది. చదువుకొన్న వారిని నిరుద్యోగపిశాచము పీడింపసాగినది. విశ్వ విద్యాలయములందు డిగ్రీలను సంపాదించిన యువకుల జీవితములు కష్టభూయిష్టములైనవి. వారికి భవిష్యత్తులో గారుచీకటులు తప్ప మరియేమియును కానుపించ లేదు. నిరాశ, అసంతృప్తి, అశాంతి. ఇవియే వారికి యేదిక్కుజూచినను ప్రత్యక్షమైనవి. ఇక వారికి యీసుందర వాతావరణము, గులాబి గుత్తులఅత్తరులు, పన్నీటిజల్లులు, మల్లెపూలదండలు, దివ్యకుసుమాంగి యీ నెలు దీసియిచ్చు తమలపాకుల మడుపులు, సొగసులాడుల సౌందర్య సంకీర్తనములు కేవలము కల్పితప్రపంచమునకు సంబంధించినవియై యెండ మావులవలె విసుగు కల్గించుటలో ఆశ్చర్యములేదు. ఆకట నకనకలాడు డొక్కలకు ఈ మధుర స్వప్నములు హాయికల్పించునా? కావున వారి దృక్పథము ఇంకొక వంక ప్రసరించినది. విద్యాధికుల భగ్నజీవితములు సారస్వత సలిలప్రవాహమునకు క్రొత్త కాలువలు గట్టినవి. ఇంతకు ముందు సారస్వతోపాసకుల నాకర్షించిన షెల్లీకీట్సుల కావ్యాజాలము, మహాసాఆస్కార్ వైల్డులగ్రంథ సముదాయము, త్వరత్వరగా వారిహృల్ఫలకములనుండి నిష్క్రమింపసాగినవి. రష్యాకు విప్లవము మనవారిదృష్టి నాకర్షించినది. మార్క్సు లెనిన్ రచనలుచదివివుత్తేజితులైనారు. గోర్కీ, హ్యూగో, డాస్టవోస్కీ, జోలా, రచనలుమన

వారి భావనాశక్తికి దోహదములైనవి. కావుననే శ్రీ శ్రీగారు

"మరో ప్రపంచం, మరో ప్రపంచం
పదండి పోదాం, వినలేదా
మరో ప్రపంచపు జలపాతం?
ఉరకండీ, ఉరకండీ, ముందుకు"
అని యుద్ధోత్సాహములో హెచ్చరించినాడు.

తమకు తమపూర్వులకుగల విభేదములను 'వ్యత్యాసం' అను గేయములో చక్కగా వ్యక్తీకరించినాడు. "వర్థించిన విస్తరి మీజీవితము, మంచికీ చెడ్డకీమధ్య కంచుగోడలున్నాయి మీకు" అని ఆయనపూర్వులనుద్దేశించి పలికినాడు.

[1] "బ్రతుకు కాలి, పనికిమాలి
శనిదేవత, రథ చక్రపు
టిరుసులలో బడినలిగిన
కూడులేని గుడ్డలేని
పక్షులార భిక్షులార
హతాశులై యేడవకండీ

[2] మీరక్తంకలగి కలగి, మీనాడులు కదలి కదలి, మీ పేగులు కనలి కనలి.

[3] అదివిజయం, అదిసమరం అటో యిటో తెగి పోతుంది,

స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్ద్ర పనాదములై.

(4) నేను సైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను, నేను సైతం విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలుపోతాను"

అని యీ ఆవేదనతో మనకవికుమారులు ముందుకువచ్చినారు. జీవితము సంఘర్షణ యని యెలుగెత్తి వచింపసాగినారు.

సమకాలిక రాజకీయములందలి మార్పులు కొంతవరకు వీరిరచనలకు ప్రోత్సాహ మొసంగినవి. (Man in the street) ప్రజాసామాన్యముయొక్క శ్రేయస్సే, లోకకల్యాణమే తమ ఆదర్శమని వీరు నొక్కి నొక్కి చాటుచున్నారు. పెట్టుబడివిధానము, జమీందారీవ్యవస్థపై తిరుగుబాటు, సమాజము నందలి ఆర్థికవ్యత్యాసములు వాఙ్మయ రంగమునకెక్కినవి. శ్రమజీవులచెమటలు, అనాథల అశ్రుకణములు, దారిద్ర్య పిశాచపు ప్రళయతాండవము వీరిహృదయములపై సమ్మెటపోటులైనవి. వీరి కవితలో ఆనంద భాష్పముల కన్న అశ్రుకణములే అధికము. పండు వెన్నెలకన్న పరిగాఢతమమే, ఉత్సాహముకన్న నిరుత్సాహమే వీరి రచనల యందు కాను పించును. భావ కవులధారాశుద్ధికలిగిన వృత్తములు, ఆటవెలదులు, తేటగీతులు. ద్విపదలు మున్నగువాని స్థానము గేయము

ముగా ప్రసిద్ధులగుచున్నవో మనకు బోధపడును.

శ్రీ తాపీ ధర్మారావు గారి వంటి పెద్దలను, పండిత పరిశ్రామలను కూడ సీ అభ్యుదయోద్యమము ఆకర్షించినది. శ్రీశ్రీగారి "మరో ప్రపంచం"లో వారు పులకితులై, అభ్యుదయ గీతముల నాలపించినారు. ఈ పరిణామము నందలి వ్యత్యాసములను వారు,

"నెత్తురేడ్చు కన్నులు వేయి కలగబట్టెనోయ్
కలిమి తళుకు ఒకధనికుని కంటనుంటాది:
తిండిలేని నోరులు వేయికలగ బట్టెనోయ్
సావుకార్ల విందొక్కటి సాగుతుంటాది.
కరగి తరగు కండలువేయి కలగబట్టెనోయ్
పెద్దవారి ఫ్యాక్టరీలు పెరుగుతుంటాయి"

అనియెలుగెత్తి చాటినారు. ఈనాటి అభ్యుదయ కవులలో నొక విశిష్టస్థానమునాక్రమించుచు, అభ్యుదయ పత్రికాసంపాదక వర్గములో ముఖ్యులై, అనేకవిధముల భాషా సేవగావించుచున్న పండితులు శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రి గారు. వారి పాండిత్యము వారి రచనలలో పరిస్ఫుటముగా గోచరించుచుండును.

"రాళ్ళ్రుతిని యేళ్లు త్రాగుదుర్భరదరిద్ర
మానవులు రత్నగర్భా కుమారులైన

నాతోఁగూడ వీత సంసారయాత్ర
గడుపుచున్నారు” అని శ్రీ ప్రయాగవారు తాపీ ధర్మారావుగారి భావములనే మరొక విధముగా వ్యక్తీకరించు చున్నారు.

“ఈ ప్రపంచమునందలి కోటి కులాలకు, లక్షమతాలకు బానిసగా నేను బ్రతుకలేను. సంఘానికి చదువునేర్పు స్వతంత్రుడిగా నేను జన్మిస్తా”నని శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారు విప్లవధ్వజమునెత్తినారు. అదియే వారి యభిప్రాయములో నర జాతివిముక్తికై వెలసిన నవపతాక.

“ఈ నవపతాకము గాంచి పతిత ప్రజలగుండెలు పరిఫుల్లమయ్యె”నని శ్రీ అనిసెట్టి సుబ్బారావుగారు వక్కాణించు చున్నారు. ఈ సమధర్మ సంఘ సంస్థాపన జేయువేళయందు, “దిక్కులన్నీ మనకు దివిటీలుపట్టిన”వనివారు స్వాతంత్ర్యయోధులకు జూపించుచున్నారు. “శ్రామికుల శిరస్సులతో బంతులాడు పాలకులను ప్రగతి చక్రఘట్టనలతో సంహరింపవలె”నని శ్రీ అనిసెట్టి సుబ్బారావుగారు ప్రబోధించుచున్నారు. మరొక వంకనుండి శ్రీ నార్ల చిరంజీవిగారు “యుగయుగాలనుండి మనలను బంధించియున్న సంకెళ్ళను తెగద్రెంచవలె”నని ఆదేశించు చున్నారు. ‘క్రాంతిపథమును జూపించి శాంతిజగమును స్థాపించుట’యే వీరి ఆదర్శము. వీరి యభిప్రాయము ప్రకారము మానవజాతి చిరకాలమునుండి అనుభవించుచున్న దాస్యము

ఆక్రమించినది. శ్రవణ సుఖము, శైలీ రమ్యతలకు ప్రాధాన్యము తక్కువైనది. ఆబ్బూరివంటి కవుల క్రొత్త పోకడలు వీరి కన్నులకు లంబాడిలంగాలవలె గోచరించినవి.

ఈవిధముగా అభ్యుదయ మార్గము తెనుగుసారస్వతమున ప్రాముఖ్యతవహించినది. ఇటీవల ఒక్క మారుగ నవ్యాంధ్రకవులందరు యేక కంఠముగ [శ్రీశివ శంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావుగార్ల వంటి కొలదిమంది తప్ప] యీ ఉద్యమమునకు జయమంగళములు పాడుచున్నారు.

ఆరంభ కాలమున "రాజకీయములలోని 'కమ్యూనిజం'కు సారస్వతమునందలి రూపాంతరమీ అభ్యుదయమార్గము"ను అభిప్రాయములు వ్యాపించియుండెను. కాని ఇటీవల అభ్యుదయ రచయితల సంఘమువారు యీ అభిప్రాయములను నివారించుటకు ప్రయత్నముగావించుట సంతోషప్రదము.

ఇటీవలవీరిసమావేశములందు సుప్రసిద్ధాంధ్ర కవి శేఖరులు పాల్గొనుచున్నారు. నన్నయాదులగు పూర్వులనుకూడ వీరు అభ్యుదయ వాదులుగనే అంగీకరించుచున్నారు. లక్ష్మణరావు, వీరేశలింగము వంటి వారి వర్ధంతులను వీరు జరుపుచున్నారు. చిలకమర్తివారి 'స్వీయచరిత్ర'ను వీరు ప్రకటించియున్నారు. న్యాయమూర్తి రాజమన్నారు వంటివారు వీరి

సమావేశములకధ్యక్షత వహించి, తమయుపన్యాసమును సమ
న్వయ పద్ధతినే నడిపించినారు; అన్నియు సమాధాన వాక్యము
లనే పలికినారు. రచన, రచన కొరకుగాక జీవితమును రమణీ
యము జేయుట కొరకని వీరి వాదన. సమాజమునందలి క్రుళ్ళు
ను తీసి వేయువలెను. అభివృద్ధికి దారితీయు అన్ని యుద్యమములు
కు సహకారమొనరింపవలెను. శాంతి స్వేచ్ఛలను సాధింపవలె
ను. సాహిత్యముద్వారా మన సాంఘిక జీవితమును పునరుజ్జీవింప
జేసికొనవలెను. విప్లవ శక్తి యెచ్చట గోచరించినను దానిని
బలవంతము జేయువలెను. క్రొత్త యుగమునందలి విశిష్టతను
ప్రజలకు ప్రబోధింప వలెను. సమస్యను నిర్దేశించి కర్తవ్యమును
స్ఫురింపజేయ వలెను.

ఇట్టియున్నతాదర్శములతో మన యువకవులు సారస్వత
రంగమున ప్రవేశించి ముఖ్యముగా గేయ రూపమున తమయా
వేదనను వ్యక్తీకరింప సాగినారు. మన సమాజమునందలి అన్యా
యములను, ఘోరవ్యత్యాసములను వీరు సుస్పష్టముగా ప్రకటిం
చుచున్నారు. ఈనాడు మనల నెదుర్కొనుచున్న సమస్యలేవి
యో వీరి గేయములు ప్రజా సముదాయమునకు వ్యక్తీకరించుచు
న్నవి. స్థాలీపులాక న్యాయముగ యీ యువకవుల రచనల కొన్నిం
టిని పరిశీలించినచో వీరి హృదయములందు అగ్ని పర్వతములేవిధ

పోయి స్వాతంత్ర్యము రానున్నది. ఈనార్లవారి పలుకులు విన్న పుడు శ్రీశ్రీగారి

'ఏదేశ చరిత్ర చూచినా యేమున్నది గర్వకారణం...

నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం'

కావుననే కాబోలు యీ అభ్యుదయ వాదులకు తమ ప్రాచీన చరిత్రయందు అంతగ గౌరవమున్నట్లుకానరాదు. వీరికి ఒక తరము ముందటి కవీశ్వరులవలె, వీరుప్రాచీనాంధ్ర వైభవమును, ప్రశస్తిని కీర్తించి యుండలేదు. అది వీరి భావనా శక్తికి దోహదమొసంగి యుండలేదు.

నేటి మతకలహములను మరచి ప్రజలందరు ఏక కుటుంబము గా మెలగ వలెనని యీఅభ్యుదయ కవులు ప్రబోధించుచున్నారు. కావుననే శ్రీకొనకళ్ళ వెంకటరత్నంగారు,

"ఉక్కు తల్పుల ఊచలొక్కటైనా విడదు

సంకెళ్ళ బరువింత సడలిపోనే లేదు

కత్తులేడ్చులిపించుతావా,

సోదరుల

కుత్తుక తెగనరుకుతావా?"

అని ఆవేదనతో ప్రశ్నించుచున్నారు- కర్షక కార్మికుల జీవితము అభ్యుదయ సాహిత్యమునందు అగ్రస్థానమునాక్రమించు చున్నది. కూలీల రైతుల సుఖదుఃఖముల నీకవులు చక్కగా

గానముచేసియున్నారు శ్రీ విశ్వనాథ కృష్ణదేవరాయలుగారి యువకవులు,

'ఏరువాకను గాంచుట ఏటి ఏట మురిసిపోకోయి
కరవు రాదోయి
దేశానపరువు పోదోయి'

అని కర్షకుని అర్థించుచున్నారు. కాపు కుటుంబమున జన్మించి వ్యవసాయము జీవనోపాధిగా గలిగిన రైతు బిడ్డయగు శ్రీ గంగుల శాయిరెడ్డిగారు తన సమస్యలను గేయములలో మనోహరముగా వ్యక్తీకరించియున్నారు. శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి వంటి విమర్శక వతంసుల ప్రశంసల నందిన గంగులశాయిరెడ్డిగారి గేయములను నిజముగా అభ్యుదయ సాహిత్యమున కలంకారములని చెప్పవచ్చును.

ప్రొద్దంతయు చెమటయోడ్చి కష్టించి పనిజేయు శ్రమజీవులే మనసంఘమునుండి వైదొలగినచో, మనగతియేమి కావలయునని యువకవులలో శ్యమంతకమణివలె తేజశ్శాలి శ్రీ పొట్లపల్లి రామారావుగారు ప్రశ్నించుచున్నారు.

అన్యాయముగా రాజులకోపాగ్నికి గురియై చెరసాలలో క్రుంగి కృశించుచున్న స్వతంత్ర భావసేవితులగు అజ్ఞాతజీవులను అసహాయజీవులను గాంచి వీరెట్టిభావనలను వ్యక్తీకరించినారో

విచారించుము. మానవునిరూపములోనున్న దానవులు ఉక్కు గొలుసులు వేసి, ఉరికొయ్యలునాటించి, నిలువు గోడలుగట్టియూ అసహాయజీవిని ఖైదీగావించినారు. ఇక వారేమో రక్తము పానించి రాజ్యతృష్ణాంధులై దేవతలరూపమున తిరుగుచున్నారు. మరియొకచోట పీడిత ప్రజాసముదాయము నుద్దేశించి యెంత సహ్యమగు భావములను వెల్లడించినారో తిలకింపుడు. "జనతయొక్క జననము చీకటిలో; మరణము వాకిటిలో; చరిత్ర విస్మృతిలో". వారు కోర్చినది లేదు. మరచినది లేదు. అట్టియుసను వారియందు నిబిడీకృతమైన శక్తి బలవత్తరమైనది. స్టాలిన్ ఆశక్తిని జూచి సమ్మోహితుడైనాడు. మహాత్ముడు ఆశక్తికి ముగ్ధుడైనాడు. నిజముగా ఏవ్యక్తిపైనను పూలుజల్లునది వారే; రాళ్ళుజల్లునది వారే; కిరీటమెక్కించినను వారే; ఉరియెక్కించినను వారే. తెరచాటుభాగవతము వారికి సరిపడదు. ఈ విధముగ పీడిత సముదాయపు ఆధిక్యతను కీర్తించినారు శ్రీ పొట్లపల్లి వారు.

అభ్యుదయ మార్గమున కలముకవాతులను చేయుచున్న మరొక యువకవీశ్వరుడు శ్రీ కాళోజి నారాయణరావు గారు. ఆయనరచనలు, సత్యాగ్రహ సమరమునందు కృష్ణా పత్రికలలో శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ గారు వ్రాసిన గేయములను స్మరింపజేయుచుండును. రాజకీయసంఘటనలే కాళోజి

కవితకు ప్రేరకములు. స్వయముగా గరిమెళ్ల సత్యనారాయణగారివలె తీవ్ర రాజకీయములందు పాల్గొని కావ్యరచన గావించిన వ్యక్తి కాళోజి. కుందుర్తిలోని యుద్ధమువలె కాళోజి కవితలో రాజకీయము లొప్పుచుండును. 'యుద్ధపిశాచము ఉద్వేజనలను ఉక్కిరి బిక్కిరి చేసిందీ'అను యీయన గేయము మొన్నటి యుద్ధమునకు చక్కని సమీక్ష. రాజకీయ స్వాతంత్ర్యములేక మనము యెన్నాళ్ళు అథోగతిలో నుండవలెనని పరితపించినాడు కాళోజి. "పోలీసు టండను దౌర్జన్యాలు పోషణ బొందేదెన్నాళ్ళు? దమననీతితో దౌర్జన్యాలకు దాగిలుమూతలు యెన్నాళ్లు? బాధలు పెట్టి పలకనీయని పాపుల భయమెన్నాళ్ళు? పగటిదోపిడుల నాపగలేక ప్రజాదరణ గోల్పోయిన ప్రభుత్వమింకెన్నాళ్లు" అని యీయన ఆక్రందించినాడు

"రాజులపేరిట అరాజకమునకు
జరిగిన పూజలుచాలింక,
బీదల సర్వస్వముతో ధనికులు జేసిన
బేరములుచాలింక" అని యీ వేదన పడి

సం-డా. కావుననే యీయనకు యీప్రపంచము గడియ గడియకు మారునదిగా, గవ్వకుకొరగానిదిగా కనుపించుచున్నది. నిజమేగదా; యీనాటి ప్రపంచములో,

“అన్న పురాసులు ఒకచోట
ఆకలిమంటలు ఒకచోట
సంపదలన్నీ ఒకచోట
గంపెడుబలగం ఒకచోట
అవకాశమంతయుఒకచోట
అవసరమెల్లను యింకొకచోట” అని

యీకవీశ్వరుడు మనకు చూపించుచున్నాడు. ఎంతయదార్థదృష్టి! దౌర్జన్యములనే రూపమునను సహింపలేని సుకుమార హృదయుడు మన కవీశ్వరుడు. కాని ఆయన యేమి చేయును?

“అవనిపై జరిగేటి అవకతవకలు జూచి
ఎందుకో నాహృదిని యిన్ని ఆవేదనలు
పరులకష్టము జూచి పగిలిపోవును గుండె
మాయలోకము జూచి మండిపోవును ఒళ్ళు
పతిత మానవుజూచి చితికిపోవునుమనసు”

అనిక్రోశించి

“తప్పుదిద్దగలేను దారిజూపగలేను
తప్పుజేసినవాని దండింపగాలేను
కష్టపడువారల కాపాడగాలేను
పరుల కష్టాలతో పనియేమి మనకనెడు
అన్యులనుజూచైన హాయిగామనలేను

అని నిస్పృహ చెందుచున్నాడు. కాని కవి గారిట్టినిరాశ

చెంద వలసిన యవసరము లేదు.కవులు యెన్నుకొన బడని శాసన కర్తలు.వారికలమునకున్న శక్తియు మోఘమైనది.జాతిని జాగృతము గావించి సరియైన మార్గమున నడిపించగలశక్తి రచయితలకుకలదు. కావున వారు యికముందును యిట్లే రచనా పరంపరను సాగింపవలెను. దాని ప్రభావము తప్పక సమాజమున గోచరించితీరును. కాళోజి కవీశ్వరునివలె మరియొక యువకవి గూడ నిస్పృహ చెందినాడు.

మానవుడు,

"నాయింటినడుమనే పెనుమంటలేరేగ
నాతమ్ముళే విలయ నాట్యాలు సేయగా
నాకూనలే నాడు బాకులకుగురికాగ
నాదుచెల్లెండ్ర మరియాద కోల్పడి కాగ
నాతల్లి గుండియలు కోతల్లుపడ్డాక
నా నేలకరువులకు తావలంబైనాక
నా నాయకుల రక్తనాళాలు తెగినాక
నాసభ్య సంస్కృతుల్ నరుకబడ్డాక
ఏమివ్రాయాలె నే నేమి వ్రాయాలె" అని

ధవళా శ్రీనివాసరావు గారు ఆక్రోశించుచున్నారు. వీరికిగూడ నా విజ్ఞప్తి ఇదియే.

వీరివలెనే మన యువకవులలో వెల్దుర్తి మాణిక్యరావుగారు ప్రకాశించుచున్నారు. మానవులందరు సమానులేయని వీరు ప్రతిపాదించుచున్నారు. అగ్ర

వర్ణములవారు నీచవర్ణములవారిని 'ఏమిరాయనీ' ప్రశ్నించుట వీరికి దుస్సహము.

కావుననే,

“అయ్యా శ్వేదము ఎవరి అబ్బ సొమ్మోయి”

అని ప్రశ్నించుచున్నారు. జీవిత మార్గము నందలి ఒడుదొడుకులన్నియును 'ఒరిగాళ్ళకే తెలుసు'నని వీరు వచించుచున్నారు.

వీరందరిలో దాశరథి కృష్ణమాచార్యులు గారికొక ప్రత్యేకమగు స్థానము కలదు. వీరు శ్రీశ్రీని అనుకరించి మించినారని నా మిత్రులగు శ్రీ రంగనాథరావు గారు వచించిన మాట పరమ సత్యము. సంస్కృతాంధ్రములందు చక్కని పాండిత్యము కలిగి యువ కవులలో సంస్కృత సమాసముల నుపయోగించుటలో దక్షులు. అభ్యుదయ కవిత్వమునకు మేలి నిదర్శనములు వీరిరచనలు. కమ్యూనిష్టు సిద్ధాంతములకు చక్కని భాష్యములు వీరిగేయములు. “ఆగర్భ శ్రీనాథుడికి అనాథుడికి అనాదిగా సాగుతున్నది అనంత సంగ్రామ”మని వచించుచున్నారు. ఆ సంగ్రామము యొక్క దిగ్విజయము ఆకాంక్షించుచున్నారు. చెమటయోడ్చి కర్షక కార్మికులు ఉత్పత్తి జేయు దేశధనమును జమీందార్లు, శ్రీమంతులు దోపిడి జేయుట వీరికి గిట్టదు.

అంతేకాదు,

"మధనపడే మేధావులు
నిర్మించిన అణుశక్తికి ప్రభుత్వాల కంట్రోళ్ల"ను వీరు గర్హించుచున్నారు.

"సజ్జబువ్వ కోసమై లజ్జ విడిచి
చినిగిన చీరెలతో మజ్జిగాలు తిరిగే
పేదల ఎంగిలి మోములు దొంగిలించి
బంగారం పోగించిన ధనికులను
మింగాలని దొంగ చాటుగా కాలం
తొంగి చూచుచున్న"

దని హెచ్చరించుచున్నారు

ఈ అభ్యుదయ రచయితల కవితావ్యాసంగము ముఖ్యముగా గేయరూపముననే మనకు లభించుచున్నది. వృత్తములు మున్నగు పూర్వ ఛందస్సులను వీరెవ్వరు [శ్రీ ప్రయాగ కోదండ రామశాస్త్రిగారివంటి యొకరిద్దరు తప్ప] తమసాధనగా స్వీకరింపలేదు; అవియందుకు తగినవి కావనికూడ వీరిలో కొందరు విస్పష్టముగా వచించి యున్నారు. కాని పూర్వఛందస్సునే సాధనగా గ్రహించి అభ్యుదయ కరముగా కావ్యరచన గావించిన కవులు కొందరు కలరు. వీరిలో శ్రీ వానమామల వరదాచార్యులవారు, శ్రీ పిల్లా వేంకటరత్నము గారు ముఖ్యులని చెప్పవచ్చును. మధురకావ్య రచనాదక్షులై, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి వంటి మహాకవిని మెప్పించిన వరదాచా

ర్యాలవారి ఖండకావ్యముల సంపుటనగు "మణిమాల" తెలుగు తల్లి కంఠమునవేసిన మణిమాలయే. అందువీరు 'హరిజనుడు' 'నుక్కి-బక్క', 'పాకీవాడు', 'పాదరక్ష' మున్నగు శీర్షికల క్రిందవ్రా సిన పద్యములకు రసమూల్యమే గాదు, ప్రయోజన మూల్యము గూడకలదు. వీరివలెనే శ్రీపిళ్ళా వేంకటరత్నముగారు మరొక దిక్కునుండి 1942 సంవత్సరము నాటి భారతీయ వీరగాథలను కావ్యగానము జేసినారు. ఆగ్రంథమును పఠించునప్పుడు "పసి పాపలుబుసకొట్టెదరు, కసవూడ్చెడి ముసలియవ్వ కనలె త్రావడి" కదనమున కాయత్తమగును. ఒక్క మారు ఆసేతు శీతాచల పర్యంతమగు దేశమున నివసించు చున్న భారతీయుల కండలు కదలింపజేసిన, ఆమహోజ్వలమగు పోరాటనకు యీకవిగారు తమగ్రంధమున అక్షరరూపమొసగి రసవాహినులను, రక్తవాహినులను ఒక్కటే ధాటితో ఏకముఖ ముగా ప్రవహింపజేసి ధన్యులైనారు. అన్నివందల పద్యములు వ్రాసినను ఎచ్చటగూడ శిల్ప సౌభాగ్య మావంతయుకొరవడక జాతిని కార్యోన్ముఖముగావించి స్వధర్మ నిర్వహణార్థము కంక ణముదాల్పజేయు ప్రయోజనమూల్యము గూడ సాధించినారు శ్రీ వేంకటరత్నము గారు. వీరి కావ్యము అభ్యుదయ సాహిత్య మున అగ్రస్థానమలంకరించుచున్నది. నన్నయాదులగు పూర్వ కవులు, శ్రీ చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారి వంటి ఆధునిక కవులు అభ్యుదయకవులుగాపరిగణింపబడుచున్నప్పుడు వీరుగూడ అభ్యు

దయ రచయితలే యనుటలో యెట్టి అతిశయోక్తియునులేదు.

అభ్యుదయసాహితీపరులను యువకవుల భాష నుగురించియొక మాట. దీర్ఘ సంస్కృత సమాసములతో నింపియున్న వీరిలో కొందరి గేయములు ప్రజా సామాన్యము నేవిధముగా రంజించునో తెలియదు. ప్రజలకొరకుద్దేశించిన సాహిత్యము నందు గాఢగాఢ సమాసములకేమైన తావు కలదాయని యోచింపవలెను.

1 "మహోత్పాతమై, గహనాంతర నిష్యందివలె"
2 "సజీవజాజ్వల్యమాన విప్లవ శంఖపువిఘాతం"
3 "భుజంగప్రయాతం బభూతాభిఘాతం"
4 "ఖడ్గమృగోదగ్రవిరావం, ఝంఝానిలషడ్జధ్వానం"

స్థాలీపులాకన్యాయముగా ఉదాహృతములు. వీరిరచనలు జానుతెనుగుననే విలసిల్లవలెను. సాహిత్యముయొక్క పరమ ప్రయోజనము లోకకల్యాణమను ప్రాచీనుల యభిప్రాయమునే అభ్యుదయ వాదులుకూడ అంగీకరించుట మిక్కిలి ప్రశంసనీయము. సారస్వత నవ్యతకు సర్వదాసుస్వాగతము. క్రొత్తది యన్నంతమాత్రముననే ఎవ్వరును ఉలికిపడవలసిన యవసరములేదు. మార్పు సజీవసాహిత్యమునకు సహజమగు లక్షణము. పాడినపాటల నేమరలపాడుట వలన ఎట్టిప్రయోజనము లేదు. ఏదోయొక విలక్షణతయున్నప్పుడే రచనలుశోభించును. అంధానుకరణము

అనర్థదాయకము. నిజమైన రచయిత రచనలయందు తన ప్రత్యేక వ్యక్తిత్వమును ప్రతిబింబింప జేయవలెను. అప్పుడే సారస్వతమునకు సార్థకత. కాని యొక విజ్ఞప్తి. వాఙ్మయమున సాంప్రదాయమును తృణీకరింపరాదు; సాంప్రదాయము పవిత్రమైనది. మనసాంప్రదాయము పోషించుకొనుచు ఎన్ని మార్పులైనతేవచ్చును; ఎంతముందుకైనపోవచ్చును. అదియే నిజమైనప్రగతి.

"దేశమని యెడుదొడ్డ వృక్షము
ప్రేమలను పూలెత్తవలెనోయ్.
... ... ... ...
ఆకులందున అణగిమణగీ
కవితకోయిల పలకవలెనోయ్.
పలుకులనువిని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్.

అను గురుజాడవారి మాటలు నేటి కవులందరకును ఆదరణీయములు.

అభ్యుదయవాదుల కొకయున్నతమగు ఆదర్శముగలదు; ఉజ్వలమగు భవిష్యత్తుగలదు.

# సాధన సమితి

## క్రొత్త పోషక వర్గము.

మహా రాజ పోషకులు:

శ్రీ శ్రీ తిరుమలకొండ సత్యనారాయణగారు. [సూర్యాపేట]

రాజపోషకులు:

,, బచ్చు శ్రీరాములుగారు. (నాయకగూడెము)

,, బచ్చు రాములుగారు. ,,

,, దీవెల వెంకయ్యగారు ,,

,, బూరెల వెంకటనర్సయ్యగారు. ,,

పోషకులు:

,, సోమవరపు ముత్తయ్యగారు. [నల్లగొండ]

---

ముద్రితము:— పద్మశాలి ప్రింటింగ్ ప్రెస్, రాంకోట్. హై-ద